బైద్యనాథ్
ప్రచురణ

# ఆయుర్వేద ఔషధ సేవన విధానము

వైద్యుల ఉపయో
గార్థము మాత్రమే

షధ గుణములు
పయోగములు
రియు
వన విధానము



శ్రీ బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ లిమిటెడ్

# బైద్యనాథ్

## ఆయుర్వేదీయ ఔషధ

## సేవనవిధి

ఆయుర్వేదము నందలి సర్వోత్తమ ఔషధములు,
రోగానుసార మరియూ ప్రయోగవిధి యొక్క
సాంగోపాంగ వర్ణన


ప్రకాశకులు :

**శ్రీ బైద్యనాథ్**

**ఆయుర్వేద్ భవన్ లిమిటెడ్**

కలకత్తా, పాట్నా, ఝాంన్సీ, నాగపూర్, నైనీ (అలహాబాద్)
సెల్సుడిపో: 21–7–802, హైకోర్టు ఎదుట,
హైదరాబాద్ – 500 002.

బ్రాంచి : 26-22-21/ఎ, ముదున్నూరి వారి వీధి,
గాంధీనగర్, విజయవాడ – 520003.

# బైద్యనాథ్

# ఆయుర్వేదీయ ఔషధ సేవన విధి

## (తెలుగు సంస్కరణ)


ప్రకాశకులు : శ్రీ బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ లిమిటెడ్
గ్రేట్ నాగ్‌రోడ్, నాగపూర్-9

సర్వాధికారము : ప్రకాశకుల అధీనము

మూల్యము : రు. **10.00**

ప్రతులు : 10,000 పంచమ ముద్రణ 1998

సంవత్సరము : 1998

ముద్రణ : కిరణ్ గ్రాఫిక్స్
15-3-383, శిరిడి కాంప్లెక్స్,
బస్ డిపో ఎదురుగా, గౌలిగుడ,
హైద్రాబాద్ - 500 012
ఫోన్ : 4614332

# విషయ సూచిక

# బైద్యనాథ్
# రసౌషధముల ప్రత్యేకత

అల్పమాత్రోపయోగిత్వా దరుచేర ప్రసంగతః

క్షిప్ర మారోగ్యదాయిత్వా దౌషధేభ్యో ధికో రసః !!

రసౌ ధములు స్వల్ప మాత్రా ప్రయోగము చేతనే, గుణకారి గాను, సేవనలో అరుచిని గల్పించకను, అతి శీఘ్రముగా ఆరోగ్యము గల్గించునదిగ నుండుటచే ఆయుర్వేద చికిత్సలో సర్వోత్తమ ప్రాధాన్యత గల్గియున్నది.

ఏదైన కషాయ ఔషధము కనీసము 3 - 4 ఔన్సులు సేవించిననే ఫలితము కల్పించును కాని రసౌధములు అతి స్వల్ప మాత్రలో అనగా 1,2 గుంజామాత్రలో ..... ప్రమాణములోనే సేవించిన గుణకారిగా నుండును. చూర్ణము, కల్కము, అవలేహ్యము మొదలగు మిగిలిన ఔషధములన్నియు అధిక మాత్రలో సేవించిననే గుణము నిచ్చును. కేవలము రసౌషధములలోనే స్వల్పమాత్రలో పనిచేయు అద్వితీయమైన ప్రత్యేకత కలదు.

అన్ని ఔషధములు గుణవంతములైననూ సేవించుటలో రుచి కరములు హితకరములుగా నుండని ఔషధములు చాలా కలవు. దీని వలన రోగులు సేవించుటకు ఇష్టపడక ఒకవేళ బలవంతముగా ఔషధము సేవించిన యెడల వాంతి మొదలగు ఉపద్రవములు కల్గును. రసౌషధములందు సేవించుటలో ఎట్టి ఇబ్బందియు లేక రుచికరములైన అనుపానములతో సేవించదగినదిగా నుండి రోగులకు హితకరముగా నుండును. ఒకప్పుడు తీక్షణమైన, అహితమైన అనుపానములతో సేవించ వలసినను స్వల్ప మాత్రలో సేవించుటవలన రోగులకు ఇబ్బంది కలుగదు.

రోగములను శీఘ్రముగా నివారించుటలో రసౌషధములకు సాటియైన ఔషధములు ఏవియు లేవు. సేవించిన 1/2 గంటలలోనే రసౌషధములు పనిచేయును. శీఘ్రముగా పనిచేయు ఆధునిక, అల్లోపతి, ఔషధములచే ప్రభావితమైన ఈ కాలమందు రసౌషధములే ఆయుర్వేద శాస్త్రము యొక్క ఉనికిని కాపాడుచున్నవి.

ఈ రసౌషధముల ప్రభావము వలననే అల్లోపతి వైద్యుల ద్వారా చికిత్స చేయలేక వదలివేయబడిన అసాధ్య రోగులకు చికిత్స చేసి ఆయుర్వేదవైద్యులు కీర్తిని పొందుచున్నారు.

అగ్ని మాంద్యము జనించిన రోగికి కూడ పర్పటి ప్రయోగము యొక్క ప్రభావము ద్వారా దినమునకు 10,12 లీటర్ల పాలు సేవించ గలుగుచున్నాడు. పర్పటి సేవించు రోగి దినమునకు సుమారు 20 లీటర్ల వరకు కూడ పాలను సేవించుట కన్పించును. ఈ ప్రకారము అన్య రసౌషధములు శీఘ్రముగా పనిచేయుటలో అద్వితీయమైనవిగా పేర్కొనవచ్చును.

ఆయుర్వేద శాస్త్రమునందు ''ఉత్తమో రసవైద్యస్తు మధ్యమో మూలికాదిభిః...'' అని రసౌషధములచే చికిత్స చేయు వైద్యులను ఉత్తమ వైద్యులుగను, మూలికలచే చికిత్సచేయు వైద్యులను, మధ్యమ ములుగను చెప్పబడిరి. దీనిని బట్టి కూడ రసౌషధముల ప్రాముఖ్యత తెలుయుచున్నది. శాస్త్రమునందు చెప్పబడిన విధి నియమానుసారము తయారుచేయబడిన రసౌషధములు కల్గిన వైద్యుడు నిస్సందేహముగా అన్ని వ్యాధులను నివారించి ప్రసిద్ధిని పొందును.

# భస్మముల ప్రాముఖ్యత

ఆయుర్వేద శాస్త్రమునందు భస్మములు అత్యంత ప్రాముఖ్యతను కల్గియున్నవి. మహారాష్ట్ర, గుజరాత్ ప్రాంతములందు సామాన్య వ్యాధులందు క్వాథము మరియు కాష్టౌషధముల ప్రయోగముతో పాటు భస్మముల ప్రయోగము కల్గించును. ప్రతి శ్యాయము లేదా జలుబులందు బనప్ప (బ్రాహ్మీ) వలె అభ్రక భస్మమును ప్రయోగముచే శీఘ్ర నివారణ కన్పించును, కాష్టౌధనములతో పాటు రస భస్మముల ప్రయోగము వలన అత్యంత ఆశ్చర్యకరమైన ఫలితము కల్గించును. పాండు గ్రహణిరోగము, శోద రక్తధాతు క్షయములందు లోహమండూర భస్మములతో దీటైన ఫలముల నిచ్చు ఔషధములు లేవు. రాజయక్ష్మ రోగము నుండి శమింపజేయుటకు స్వర్ణభస్మమును మించన ఔషధము లేదు. వజ్ర భస్మమము, ముత్య భస్మము, ప్రవాళ భస్మములతో సమానమైన హృదయమునకు బలమును కల్గించు ఔషధమిది! ప్రమేహమునందు మరియు ధాతుపుష్టి కలుగజేయుటలో వంగ భస్మములో తుల్యమైన ఔషధమే లేదు. ఇదే విధముగా రసభస్మములన్నియు రామబాణమువలె తిరుగులేనివిగా వ్యాధులను శమింపజేయును. అల్లోపతి వైద్య విధానము నందు ఇంజక్షన్ ఔషధములు ఏ విధముగా తాత్కాలసముననే పని చేయునో అదే విధముగా ఆయుర్వేదర భస్మములును పనిచేయును. శాస్త్రోక్తవిధి ననుసరించి నియబద్ధముగా తయారు చేయబడిన రసభస్మములు సక్రమముగా నిర్ధారణ చేయబడిన రోగములందు తగు అనుపానముతో సేవించిన ఎడల నిశ్చయముగా ఇంజక్షన్ ఔషధములకంటే శీఘ్రముగా రోగనివారణ జరుగును రోగులనుండి అధికముగా ధనము నపేక్షించి ఇంజక్షన్ చికిత్స చేయు వైద్యుడు ఉత్తమ వైద్యుడుగా పరిగణింప బడడు. ఆయుర్వేదము లోకకళ్యాణము నపేక్షించు శాస్త్రము, రోగ నివారణలో రసభస్మములు ఇంజక్షన్ ఔషధములకంటే ఉత్తమముగా పని చేయుననుటలో సందేహములేదు. ఒక్కొక్కప్పుడు ఇంజక్షన్ ఔషధములు రోగనివారణ చేయకపోగ తీవ్రమయిన

వికారములను గల్గించి ప్రాణాపాయమును కూడ కల్గించును. కాని శాస్త్రోక్త విధిని ననుసరించి తయారు చేయబడిన రసభస్మములు ఏ విధమైన ఉపద్రవములను వికారములను కల్గించక పనిచేయును. రసభస్మములు తరుణ వయస్కులకు ప్రయోగించుటవలన రోగ నివారణ జరిగినను మరల వారికి రోగములు జనించినప్పుడు రసభస్మములు తప్ప వేరే ఔషధములు పని చేయవనియు ఈ రసౌషధములు శరీరమునందు పచనము శోషణ జరుగక బయుటకు నిర్గమించుననను అపవాదు కలదు. కాని ఇది అసత్యము! భస్మములు ఖనిజములైన ధాతువులచే తయారు చేయబడినవి. ఆధునిక విజ్ఞానశాస్త్రము కూడ ఈ ధాతువులచే తాయారు చేయబడినవి. ఆధునిక విజ్ఞానశాస్త్రము కూడ ఈ ధాతువులు శరీరమునకు ఏ విధమైన నష్టమును కలుగ చేయని అంగీకరించినది. నిత్యము మనము సేవించు ఫలము లందు మరియు ఇతర ఆహార పదార్థము లందు అనేకములైన ధాతువుల వృద్ధి కల్గించు పదార్థములు గలవు. అల్లోపతి, వైద్యశాస్త్రము నందు కూడ లోహము, స్వర్ణము రజతము, లోహము తామ్రము మొదలగు ధాతువుల ఔషధరూప ప్రయోగము కల్పించును. ప్రాచీన శాస్త్రము లందు నవజాత శిశువునకు స్వర్ణ ప్రాశన (స్వర్ణమును సేవింపజేయుట) చెప్పబడినది. దీనిని బట్టి రసౌషధములు భస్మములు అన్ని వయస్సుల వారికిని లాభదాయకముగా నుండునని తెలియుచున్నది.

సరిగా శుద్ధిచేయబడని ధాతువులతో తయారుచేయబడిన భస్మములు శాస్త్రోక్త విధి ననుసరించి తయారు కాని భస్మములు హాని చేయుననుటలో సందేహము లేదు. భారతదేశము నందు అన్ని ప్రాంతములందును రస భస్మములు చేయుటలో అనేకమంది పూర్తిగా వ్యాపారముగా చేసుకొన్నవారు కనిపించెదరు. వీరు శాస్త్రోక్త విధి ననుసరించి ఔషధములు తయారు చేయక కేవలము ధనార్జన నిమిత్తము ఈ ఔషధ వ్యాపారము చేయు చుందురు. వీరి విక్రయించు ఔషధములు అతి తక్కువ వెలలో నుండుట కనిపించును.

ఇటువంటి ఔషదములు విక్రయించుట, ఖరీదుచేయుట అనైతికమేగాక అయుర్వేద శాస్త్ర ప్రామాణికతకు మరియు జనస్వాస్థ్యమునకు హానికరము. చౌకగా లభించుటచేత ఈ ఔషధములను కొని వాడుటవలన రోగనివారణ జరుగకపోగా శరీరమునందు అనేక వికృతులు కల్గి రోగి ప్రాణమునకు ముప్పు కలుగ వచ్చును. తద్వారా వైద్యునికి అపకీర్తి, జననష్టము, ఆయుర్వేదమునకు అపకీర్తి తెచ్చినవారగుదురు. ఔషధ విక్రేతలు కూడ కేవలము అధిక లాభాపేక్షతో ఇట్టి అశుద్ధమైన ఔషధములను విక్రయించుట ఉచితము కాదు.

కొంత మంది అధునికులు కూడ శాస్త్రీయమమని చెప్పుచు అప్రశస్తభస్మములు తయారుచేసి అమ్ముచున్నారు. కొంతమంది ఆధునిక ఔషధ నిర్మాణ వేత్తలు తేజాబు మొదలగు అమ్లములతో భస్మములు తయారు చేసి అమ్ముచుందురు. శాస్త్రీయ ప్రామాణిక తననుసరించి భస్మము తయారు చేయవలెనన్న వనోపలముల చేతనే చేయవలయును. కలకత్తా వంటి మహానగరములో మామూలు ఉపలములే దొరుకుట కష్టము. వనోపలములు దొరుకుట అసంభవము. కలకత్తా యందలి ఔషధనిర్మాతలు రాక్షసి బొగ్గుచే (Rail Coal) తయారు చేయుదురు. రాక్షసి బొగ్గు లేక తేజాబుచే నిర్మితము చేయబడిన భస్మము ఏ విధముగా నుండునో ప్రతివైద్యునికి తెలిసిన విషయమే. రాక్షసి బొగ్గుతో తయారైన భోజన పదార్థములు రుచిలోను, గుణములోను హీనముగా నుండునను విషయము అందరికి తెలిసినదే. అత్యంత తీణమైన ఉష్ణతను కల్గించు ఈ రైలు బొగ్గుతో తయారు చేయబడిన భస్మములు ఆవేదికి ఆ ధాతువులందలి ధాతుపోషక పదార్థములో ఒక్కసారి భస్మమగుటవలన వికృతిచెందును. ఈ ఔషధ నిర్మాణ వేత్తలు అయుర్వేదమునందు విశ్వాసముంచక కేవలము లాభాపేక్షతో ఔషధములు విక్రయించుట కొరకై ఆయుర్వేదము పేరు గుణకరములుగాని వికృత పరిణామములను కలుగజేయు ఔషధములను ఆరోగ్యమును కల్గింప చేయు వైద్యుడు ఇట్టి నకిలీ ఔషధములను వాడుట తగదు. ఆయుర్వేదశాస్త్రము నందు నిర్దేశింపబడిన

ప్రామాణికత ననుసరించి తయారుచేయబడిన భస్మములనే వాడి రోగుల రోగనివృత్తి చేసి తద్వారా అయుర్వేద అభ్యున్నతికి, జనాభ్యున్నతికి తోడ్పడవలయును.

## రసభస్మముల నిర్మాణ పద్ధతి

శ్రీ బైద్యనాథ్ అయుర్వేద భవన్ లిమిటెడ్ నేటి ఆయుర్వేద ఔషధ నిర్మాణ సంస్థలలో అన్నిటికన్న పెద్ద సంస్థ. మరియు రసభస్మముల తయారీలో ప్రత్యేక ప్రాముఖ్యత నొందియున్న సంస్థగా పేరొందినది. దీనికి కారణము రసభస్మముల యొక్క నిర్మాణము శాస్త్రమునందు నిర్దేశింపబడిన పద్ధతి ప్రకారము తయారు చేయుటమే. ఈ భస్మముల నిర్మాణము రాజస్థాన్ ప్రాంతమందలి నొక గ్రామమునందు ఏర్పాటు చేయబడినది. ఇచ్చట భస్మముల నిర్మాణమునకు అవసరమైన గోమూత్రము, కలబంద, జిల్లేడు మొదలగు ద్రవ్యములు సునాయాసముగా లభించును. ఏరుపిడకలు కూడ అతి తక్కువ ధరకు లభించును ఈ వనోపలములతో తయారుచేయబడిన భస్మములు అత్యుత్తమముగా నుండును. ఈ విధముగా బైద్యనాథ్ భస్మాలు నిర్మాణమునందు ఆధునిక పద్ధతులైన విద్యుత్ యంత్రములుగాని, రాక్షసి బొగ్గుగా ప్రయోగించక శాస్త్రోక్త విధిని ననుసరించి తయారు చేయబడుచున్నవి గ్రామము నందు తయారు చేయుటవలన కల్గిన సదుపాయంవల్ల ఔషధ నిర్మాణ వ్యయము కూడ తగ్గును.

ఆ గ్రామము నందున్న భస్మనిర్మాణ శాలయందు సర్వదా 25 గజ పుటములు; 10 కూపి పక్వ రసాయనము తయారు చేయు పొయ్యిలు జ్వలించుచుండును. ఒక సంవత్సరములోనే లోహము, మండూరము అభ్రకము మొదలగు భస్మములు 10-20 మణుగులు తయారగను ఇంత ఎక్కువ మొత్తంలో తయారు చేయుట వలన ఎప్పుడును భస్మములు లభ్యమగుచుండును. అయితే పాతవైన భస్మములు ప్రశస్తములుగా

చెప్పబడినవి. ఎక్కువ పరిమాణములో తయారు చేయుట వలన పాత భస్మములే విక్రయించబడును. తక్కువ పరిమాణము తయారు చేయు వారు పురాణ భస్మములను విక్రయించలేరు. బైద్యనాథ్ వారి ఈ భస్మములు నిపుణులైన ఆయుర్వేద వైద్యుల పర్యవేక్షణలో తయారుకాబడి వారి భారీ ఔషధ నిర్మాణ శాలలైన కలకత్తా, పాట్నా, ఝాన్సీ, నాగపూర్, నైని (ప్రయాగ) లకు కొనిరాబడును. ఇచ్చట అతి జాగ్రత్తగా వాటి ప్రమాణముల ననుసరించి సీసాలందు నింపబడి అమ్మకము నిమిత్తము పంపబడును. ఔషధ విక్రేత ఏ విధమైన మోసము చేయకుండునట్లుగా ఈ భస్మముల ప్యాకింగ్ చేయబడును. ఖరీదైన భస్మములు కొనువారికి ఇబ్బంది లేకుండా అతి చిన్న ప్యాకింగ్‌లలో సహితము 500 మి. గ్రా. విక్రయించ బడును. ఔషధ భస్మము అవసరమున్న ఎడల ప్యాకింగ్ ఖరీదుచేసి ధనవ్యయము చేయనక్కర లేకుండా వివిధ సైజులలో ఈ భస్మములు విక్రయించబడును. బైద్యనాథ్ రసభస్మములు దేశమంతటను ఒకే విధమైన ప్యాకింగ్‌లలో ఒకే ధరలో దొరుకుట విశేషము బైద్యనాథ్ రసభస్మములయొక్క మూల్యము అతి తక్కువగా నుండును. ఔషధములు ఎక్కువ పరిమితిలో ఒక్కసారి తయారుచేయుట వలన మూలద్రవ్యములు ఉత్పత్తి స్థానమునందు ఉత్పత్తి చేయుటవలన నిర్మాణ వ్యయము తక్కువగా నుండుట వలన బైద్యనాథ్ రసభస్మములు తక్కువ వెలకు లభ్యమగు చున్నవి. ఇంతకన్న తక్కువవెలకు రసభస్మములు విక్రయించువారు ఏ విధముగా తయారు చేయుచున్నారో ఆ ఔషధముల ప్రమాణికత కూడా సందేహాస్పదమే. భస్మముల వర్ణరూపములను బట్టి వాటి వాస్తవికతను నిర్ణయించుట చాల కష్టము. ఆ ఔషధ నిర్మాణశాలలు మరియు వాటియొక్క ప్రశస్తిని బట్టి ఔషధముల స్వచ్ఛతను ప్రామాణికతను నిర్ణయించవలయును.

# బైద్యనాథ్
## ధాతు భస్మములు మరియు పిష్టి

అల్లోపతి వైద్యములో ఇంజక్షన్ ఔషధములు ఏ విధముగా ఆయుర్వేద చికిత్సతో భస్మములు ఇంజక్షన్ ఔషదముల కంటేకూడా పనిచేయునని నిర్ధారింపబడినవి. తొందరగా పని చేయుటకు మరియు ఉత్తమ సహకారిగా నుండుటకు భస్మములు నిర్మాణములో విశుద్ధమైన ద్రవ్యములను సేకరించుటలోను శాస్త్రోక్తవిధి ననుసరించి సక్రమముగా తయారు చేయుట పైనను ఆధారపడి యుండును. సరియైన భస్మ నిర్మాణము చేయుటకు తగిన సాధనములు సమకూర్చుకొనుట తయారు చేయుట వైద్యులందరికి మరియు ఫార్మశీల వారికి సాధ్యపడదు. బైద్యనాథ్ భస్మములు ఉత్తమత్వములోను, ప్రామాణికతలోను ప్రశస్తమని ఈ క్రింది కారణముల వలన నిర్ధారించబడినది.

1. భస్మము చేయుటకు యందు ఉఫలముల (పిడకలను) మాత్రమే ఉపయోగించబడును.

2. భస్మములు చేయుటకు తీసికొనబడిన మూల ద్రవ్యములను సక్రమముగా పరీక్షించి ఆయా ధాతువులను మాత్రమే ఉపయోగించెదరు. తక్కువ స్థాయి గల లేక మిశ్రమముకల ధాతువులను ఉపయోగించరు.

3. బైద్యనాథ్ రసాయనశాల అధ్యక్షులు పారద సంస్కారము చేయుటలోను భస్మముల నిర్మాణములోను భారతదేశము నందు ప్రఖ్యాతి గాంచిరి.

4. బైద్యనాథ్ రసాయనశాల యొక్క పర్యవేక్షణ స్వయముగా సంస్థ యొక్క మేనేజింగ్ డైరెక్టర్ గారు చేయుదురు. వారు గత 59 సం॥ ఆయుర్వేద ప్రచార, ప్రసార ఉద్ధార కార్యక్రమములో నిమగ్నులై యున్నారు.

5. భస్మములు మరియు పిష్టిల తయారు పూర్ణ శాస్త్రోక్త విధి ననుసరించి అధిక ప్రమాణములో తయారు చేయబడి నిల్వయుంచబడును.

## అకీక్‌పిష్ఠి (ఆయుర్వేద సారసంగ్రహము)

బైద్యనాథ్ అకీక భస్మము : ఈ పిష్ఠి హృదయము మరియు మస్తిష్కములకు బలము కల్గించునదిగా నుండును. వాత పిత్తహరము అకీక్ పిష్ఠి, భస్మము కంటె అత్యంత సౌమ్యముగా నుండును.

మోతాదు : 125Ma, 375Ma తేనెతో రెండు సార్లు ఉదయము, సాయంత్రము.

ప్యాకింగ్ : 5 గ్రా.

## అభ్రకభస్మము (ఆయుర్వేద సారసంగ్రహము)

ఈ భస్మము మానవునికి కల్గు అన్ని రోగములందును పనిచేయును. మరియు అనేక ఔషధములతో చేర్చబడును. శరీరమునందలి హార్మోనుల నిర్మాణములోను మరియు నియంత్రణను జరుపును. ఈ హార్మోనుల ద్వారానే శరీరము యొక్క సమస్త క్రియలు జరుగును. ఈ ఔషదము త్రిదోషహరము, బల, వీర్యవర్థకము, రసాయనము. ఈ ఔషదమును కనీసము 35 దినములు క్రమము తప్పక సేవించిన ప్రయోజనము కల్గును. ఉదరరోగము, ఆమదోషము, సంగ్రహిణి, రాజయక్ష్మ జ్వరము మానసిక వికారములు, అపస్మారము (ఎపిలెప్సి) ఉన్మాదము, ఓజోక్షయము (Neura asthenia)లను పోగొట్టి హృదయమునకు బలము కల్గించును. అమ్లపిత్తము శ్వాసకాసలు మరియు అర్శోరోగమునందు గుణకారము నుండును. అభ్రకభస్మము (సాదా) కన్న శథపుటి అభ్రకభస్మము అత్యధిక గుణవంతముగా నుండును. అభ్రక భస్మము సహస్రపుటి రసాయనముగా పనిచేయును.

మోతాదు : 60 మి.గ్రా. 250 మి.గ్రా. రోజుకు రెండుసార్లు తేనె లేక రోగానుసారము తగు అనుపానముతో. ప్యాకింగ్ – 10 గ్రా., 5 గ్రా.

శతపుటి : 30 మి.గ్రా. 120 మి.గ్రా. రోజుకు రెండు సార్లు 2.5 గ్రా. 1 గ్రా. మరియు సహస్రపుటి : 25 మి.గ్రా. రోజుకు రెండ సార్లు తేనెతో.

ప్యాకింగ్ : 1 గ్రా.

## కపర్దక భస్మము (సిద్ధయోగ సంగ్రహము)

ఈ భస్మము ఉదరశూల, కడుపుబ్బరము, అన్నద్రవశూల,

పరిణామశూల, అమ్లపిత్తము(Acidity) సంగ్రహిణి వల్ల కల్గిన వ్యాదులు, గుల్మము మరియు మందాగ్నుల యందు గుణము నిచ్చును. ఈ భస్మమునందు పిత్తము నందలి అమ్లత్వము తగ్గించు గుణము కలదు. కర్ణస్రావము చక్కగా పనిచేయును. పిల్లలలో వచ్చు యకృత్ (InfantiveLiver) మరియు అనాస వ్యాదులందు చక్కగా పనిచేయును. గుణము కనిపించుటకై ఈ ఔషధము 60 దినముల నుండి 80 దినముల వరకు సేవించవలయును.

మోతాదు : 250 మి.గ్రా.500 మి.గ్రా. తేనెతో ఉదయం సాయంత్రము రెండుసార్లు.

ప్యాకింగ్ : 10 గ్రా.

## కాశీస భస్మము (సిద్ధయోగసంగ్రహము)

పాండు, రక్తాల్పత యకృత్ ప్లీహాది వికారములందు పనిచేయును. ఈ ఔషధము పాచక పిత్తమును సమస్థితిలో నుంచి జఠరాగ్నిని ప్రదీప్తిని చేయును. ఇందు రక్తవర్ధక గుణము మరియు పిత్త శామక గుణము కలదు. ఈ భస్మమము మండూర భస్మముకన్న అధిక సౌమ్యముగా నుండును.

మోతాదు. : 250 మి.గ్రా. 500 మి.గ్రా. తేనెతో ఉదయం సాయంత్రము.

ప్యాకింగ్ : 10 గ్రా.

## కుక్కుటాండత్వక్ భస్మము

## (ఆయుర్వేద సారసంగ్రహ)

ఈ భస్మము అస్థులను దృఢముగా చేయును. శరీరమునకు బలము కల్గించును. బాలురలో వచ్చు ఆనాసరోగము అస్థిశోషము(Rickets) మరియు స్త్రీలలో కల్గు స్వేత ప్రదరము మొదలగు రోగములలో అత్యుత్తమముగా పనిచేయును. ప్రమేహము, బహుమూత్రము మొదలగు మూత్రవ్యాధులలో ఉపయోగించును.

మోతాదు : 250 మి.గ్రా. 500 మి.గ్రా. తేనెతో ఉదయం సాయంత్రము రోజుకు రెండు సార్లు.

ప్యాకింగ్ : 5 గ్రా.

## జహర్ మోహరా ఖతాయిపిష్ఠి
## (ఆయుర్వేద సారసంగ్రహము)

ఈ పిష్ఠి అజీర్ణము, వమనము, దాహము, అతిసారము, యకృత్ వికారములు జీర్ణజ్వరము, బాలురకు కల్గు పచ్చటి నల్ల విరేచనములు మరియు పక్క రోగము, మొదలగు వ్యాధులందు ఉపయోగకారిణి.

(High temperature) అతితీవ్ర జ్వరసంతాపవమునందు గుణకరమైనది.

మోతాదు : 250 మి.గ్రా. 500 మి.గ్రా. తేనెతో ఉదయం సాయంత్రం.

ప్యాకింగ్ : 5 గ్రా.

## టంకణ భస్మము (రసతరంగిణి)

ఈ భస్మము ప్రతిశ్యాయము (జలుబు) కాస, మరియు ఇన్ఫ్లుయంజా జ్వరములందు ఉపయోగకరమైనది. ఇది జఠరాగ్నిని వృద్ధి చేయును. వాతఘ్నము, కఫహరము, ముఖపాకము, అధ్మానము, ఉష్ణములందు ఉపయోగించును. గళశోధ మరియు, తుండికేరి శోధలందు (Tonsillities) పనిచేయును.

మోతాదు : 125 మి.గ్రా. - 500 మి.గ్రా. తేనెతో ఉదయం సాయంత్రము.

ప్యాకింగ్ : 15 గ్రా.

## తామ్రభస్మము (రసాయనసార)

ఈ భస్మము శూల, మందాగ్ని, అమ్లపిత్తము హిక్క, మాసార్బుదము, పిత్తాశ్మరిలందు అత్యుత్తమముగా పనిచేయును. రక్త క్షయము (Anemia) యందు లోహభస్మము చేర్చి నిచ్చిన శీఘ్రముగా గుణము నిచ్చును.

మోతాదు : 25 mg – 60 mg తేనెతో ఉదయము సాయంత్రము.

ప్యాకింగ్ : 2.5 గ్రా.

## త్రివంగ భస్మము (సిద్ధయోగ సంగ్రహము)

ఈ భస్మము, నాగభస్మము, వంగభస్మము మరియు యశద భస్మములు మూడింటిని కల్పి తయారు చేయబడును. అతిమూత్రము, మూత్రవికారములు, మధుమేహము, సోమరోగములందు అత్యుత్తమముగా పనిచేయును. ఈ భస్మము గర్భాశయ వికృతిని తొలగించి గర్భాశయమునకు బలము కల్గించి గర్భధారణకు యోగ్యముగా చేయును. నవయువకులలో కల్గు గర్భధారణకు యోగ్యముగా చేయును. నవ యువకులలో కల్గు స్వప్న స్ఖలనమును నివారించును. నియమానుసారము కొన్ని దినములు సేవించుట ఉత్తమము.

మోతాదు : 125 మి.గ్రా. 250 మి.గ్రా తేనెతో ఉదయము సాయంత్రము.

ప్యాకింగ్ : 10 గ్రా., 5 గ్రా.

## ప్రవాళభస్మము (శా.సం.)

పురాణజ్వరము, కాస, రక్తపిత్తము అమ్లపిత్తము (Acidity) అధిక దప్పిక, గర్భిణులకు కలుగు వికారములందు గుణకారి ఇది అత్యుత్తమ మైన కాల్షియంగా నిర్ధారింపబడినది. బాలురలో ఎముకల పెరుగుదలకు దృఢత్వమునకు ఈ భస్మము క్రమము తప్పక 6,7 నెలలు సేవించవలయును.

మోతాదు : 75 మి.గ్రా. నుండి 200 మి.గ్రా. వరకు రోజుకు రెండుసార్లు సేవించవలయును.

ప్యాకింగ్ : 10 గ్రా., 2.5 గ్రా.

# ప్రవాళ పిష్టి

## ( ఆయుర్వేద సారసంగ్రహ)

ఈ పిష్టి ప్రవాళ భస్మము కన్న అధిక పిత్తశమన గుణము కలిగి యున్నది. కాస శ్వాస జలుబు రక్త పిత్తము అమ్లపిత్తము వమనము కండ్లమంటలు ఉన్మాదము శిరోరోగములు, మూత్ర కృచ్ఛ్రము మొదలగు మూత్రవ్యాధులు మరియు హృదయ రోగములందు గుణకారి.

మోతాదు : 100 మి.గ్రా. నుండి 200 మి.గ్రా. తేనె లేక చ్యవన ప్రాశ అనుపానముగ ఉదయము సాయంత్రము సేవించవలయును.

ప్యాకింగ్: 10 గ్రా., 2.5 గ్రా.

# ప్రవాళ భస్మము (చంద్రపుటి)

## ( ఆయుర్వేద సారసంగ్రహ)

ఈ భస్మము చంద్రపుటముతో తయారైనదే కనక అధిక శీతలముగా నుండును. ఉష్ణప్రాంతముల యందు ముఖ్యంగా దక్షిణ భారతదేశము నందు బాలురు మరియు వృద్ధులు దీనిని సేవించవలయును.

మోతాదు : 60 మి.గ్రా. 125 మి.గ్రా. వరకు తేనెతో లేక చ్యవన ప్రాశతో రోజుకు రెండుసార్లు సేవించవలయును.

ప్యాకింగ్: 5 గ్రా.

# వంగభస్మము (రసేంద్ర సారసంగ్రహము)

మూత్ర వికారములు, శుక్రబలహీనత, స్వప్న స్ఖలనములు మరియు పురాణ రక్తదోషములందు అత్యుత్తమ గుణకారి త్రివంగ భస్మము లభ్యము కానప్పుడు దీనిని సేవించుట ఉత్తమము. వివాహమై 5 సం ల వరకు సంతానములేని దంపతులు ఇరువురూ మూడు వారములు చొ న మధ్య 2 వారములు విరామమిచ్చుచూ 3 సార్లు సేవించిన తప్పక సంతానం పొందగలరు.

మోతాదు : 100 మి.గ్రా. నుండి 200 మి.గ్రా. వరకు తేనెతో సేవించి పాలలో ఇస బగోల్ కలిపి సేవించవలయును.

ప్యాకింగ్: 10 గ్రా., 5 గ్రా.

## వైక్రాంతభస్మము (ఆయుర్వేద సారసంగ్రహ)

త్రిదోషఘ్నము, క్షయ, పురాణజ్వరము కాస, బలహీనత యందు గుణకారి, వజ్రభస్మము లభించనప్పుడు దీనిని వాడుచుందురు. కాన్సర్ వ్యాధియందు ఈ భస్మమును స్వర్ణ భస్మముతో సహిజన్ పత్రముల రసముతో సేవించవలయును. వజ్రభస్మముపుయోగించుటకు ముందు వైక్రాంత భస్మము ప్రయోగించుట మంచిది.

మోతాదు: 15 మి. గ్రా. నుండి 65 మి. గ్రా. వరకు తేనెతో ఉదయము సాయంత్రము.

ప్యాకింగ్: 2.5 గ్రా.

## మండూర భస్మము (రసేంద్ర సారసంగ్రహ)

లోహ భస్మ గుణవులన్నియుూ కలిగియుండును. లోహభస్మముకంటె సౌమ్యముగా పనిచేయును. ఔషధ ప్రభావము తొందరగా కనిపించును. సుకుమారులు ఉపయోగించుటకు ఉత్తమమైన ఔషధము. యకృత్ ప్లీహ వికారములు పాండు, కామిలశోధ, మరియు అగ్నిమాంద్య వ్యాధులలో గుణకారి.

మోతాదు : 500 మి.గ్రా నుండి 750 మి.గ్రా వరకు త్రిఫలాక్వాధముతోగాని, గోమూత్రముతోగాని రోజుకి 2,3 సార్లు రోగపరిస్థితి ననుసరించి సేవించవలయును.

ప్యాకింగ్: 10 గ్రా., 5 గ్రా.

## మధుమండూర భస్మము (యోగ రత్నాకరము)

మండూర భస్మముకన్న అధిక గుణకారి. రక్తాల్పత, పాండు, శోధ,

యకృత్ వికారములు, ఉదర రోగములందు ఉపయోగించును. రక్త వృద్ధిని కలిగించును.

మోతాదు : 250 మి.గ్రా. నుండి 500 మి.గ్రా.
ఉదయం సాయంత్రం తేనెతో సేవించవలయును.

ప్యాకింగ్ : 5 గ్రా.

## మయూర చంద్రికా భస్మము (సిద్ధయోగసాగర)

బాలురు మరియు పెద్దలలో వచ్చు అన్ని విధములైన వాంతులలో శీఘ్రముగా శమనమును కలుగచేయును. హిక్కా (ఎక్కిళ్ళు), శ్వాసలందు కూడ ఉత్తమముగా పనిచేయును.

మోతాదు 250 మి.గ్రా. నుండి 500 మి.గ్రా. శర్కరాపాకము, కచ్చూర పాకము లేక నిమ్మరసముతో.

ప్యాకింగ్ : 5 గ్రా.

## మాణిక్య భస్మము

శరీర మందలి అన్ని ధాతువుల పోషణ వృద్ధి చేయును. వాత పిత్త వికారములందు, మందాగ్ని, హృద్రోగము. సంగ్రహణి మరియు రక్త భారాధిక్యత (Hypertention) లందు గుణకారి. పిత్తప్రకోపముచే కలిగిన ధాతుక్షయము మరియు నపుంసకత్వము లందు క్రమముగా 6 మాసములు సేవించిన నిస్సందేహముగా గుణము నిచ్చును.

మోతాదు : 60 మి.గ్రా నుండి 125 మి.గ్రా. తేనెతో రోజుకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 2.5 గ్రా.

## ముక్తాశుక్తి పిష్టి (రసేంద్ర సార సంగ్రహ)

ముత్యపు చిప్పలతో తయారు చేయబడిన ఈ పిష్టి దౌర్బల్యము, జ్వరముతో యున్న దగ్గు, దాహము (మంటలు) వాంతులు విరేచనములు, శ్వాస, పరిణామశూల యకృత్ శూల అమ్ల పిత్తము, రక్త స్రావము మొదలగు

వ్యాధుల యందు గుణకారి మోతీపిష్టి కన్న అల్పగుణములు కలిగి యుండును. మోతీ పిష్టిని సేవించలేనివారు క్రమముగా 2 - 4 వారములవరకు దీనికి సేవించిన తప్పక ప్రయోజనము కలుగును.

మోతాదు : 200 మి. గ్రా. 500 మి. గ్రా తేనె లేక వెన్నతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 10 గ్రా., 2.5 గ్రా.

## ముక్తాశుక్తి భస్మము (రసేంద్ర సారసంగ్రహ)

ముక్తాశుక్తి పిష్టితో సమాన గుణములు కలిగి యున్ననూ అగ్ని పుటితమైనందున అంత శీత గుణము కలిగి యుండదు. రికెటు వ్యాధి పీడితులైన బాలురలో తరచుగా కలుగు ఉదర వికృతులు, విరేచనములు వాంతులలో గుణకారి.

మోతాదు:- 150 మి. గ్రా. 500 మి. గ్రా. తేనెతో ఉదయం సాయంత్రం దినమునకు రెండుసార్లు

ప్యాకింగ్ : 5 గ్రా.

## మోతీ భస్మము (ముత్యభస్మము)
## (రసేంద్ర సార సంగ్రహ)

ఉరఃక్షతము, హృదయ దౌర్బల్యము, జీర్ణ జ్వరము, శిరశ్శూల, స్మృతి భ్రంశము, నిద్రానాశనము, మనోవైకల్యము, బాలశోష, అధిక దప్పి మూత్రకృచ్ఛము మొదలగు వ్యాధులందు ఉపయోగించును.

నేత్రములకు మంచిది. దీనిని సేవించుటవలన పిత్తశయనము కలిగి అమ్లత్వము (Acidity) తగ్గును ఇది హృదయ వ్యాధి పీడుతులకు అమృతముతో సమానమైనది.

మోతాదు - 60 మి. గ్రా. 125 మి. గ్రా. తేనె లేక వెన్నతో రోజుకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 1 గ్రా., 500 మి. గ్రా.

## మోతీ భస్మ (నెం॥1)

అధిక శ్రేష్ఠమైన, ఖరీదు కలిగిన ముత్యములతో తయారు చేయబడినది. అందువలన మోతీ భస్మముకన్న అధిక గుణకారిగా నుండును. హృద్రోగములందు దీనినే సేవించుట ఉత్తమము.

మోతాదు 60 మి.గ్రా. 125 మి.గ్రా. తేనె లేక వెన్నతో రోజుకు రెండుసార్లు .

ప్యాకింగ్: 1 గ్రా.

## మోతీ పిష్టి (రసతరంగిణి)

ఇది అత్యుత్తమమైన కాల్షియంగా పరిగణింప బడుచున్నది. మోతీ భస్మమము కన్న అధిక గుణవత్తరమై శీతలగుణము కలిగియున్నది. అధిక పిత్తప్రకోపమువల్ల కలిగిన ఉపద్రవములందు మోతీభస్మమునకు బదులు మోతీపిష్టిని సేవించుట మంచిది.

మోతాదు : 60 మి. గ్రా. 125 మి. గ్రా. తేనె లేకవెన్నతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 500 మి. గ్రా.

## మోతీ పిష్టి నెం 1

ఇది అత్యుత్తమ గుణకారి, నేత్రకారములు, శిరశ్శూల, హృదయ దౌర్భల్యములయందు అత్యుత్తమ ఔషధము. హృదయమునకు, మస్తిష్కమునకు బలము కల్గించును. మోతీభస్మ గుణములన్నీ కల్గియుండును.

మోతాదు: 60 మి. గ్రా. 125 మి. గ్రా తేనె లేకవెన్నతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 1 గ్రా.

## యశదభస్మ (రసామృత)

ఈ భస్మము నేత్ర రోగములు పిత్తజ ప్రమేహములు మరియు మధు

మేహవ్యాధులలో అత్యుత్తమ గుణకారి. జిహ్వాపాకము, గండమాల, అపచీరోగములలో సేవించదగినది. కఫ పిత్తనాశకము, కాస, అతిసారము, సంగ్రహిణులయందు కూడ పనిచేయును. శ్వాస, మరియు చర్మ వ్యాధుల యందు నియమ పూర్వకముగ తగు కాలము సేవించుటవలన స్వస్థత కలుగును.

మోతాదు 125 మి.గ్రా. 250 మి.గ్రా. తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 5 గ్రా.

## రౌప్య (రజత) (భస్మ)(రసేంద్ర సారసంగ్రహ)

ఈ భస్మము బృంహణము మరియు వాజీకరణ గుణములు కలిగి యున్నది. వాత పిత్త వికారములయందు గుణకారి. ప్రమేహము, క్షయ, ధాతుక్షీణము, దృష్టిమాంద్యము, మస్తిష్క దౌర్బల్యములందు గుణకారి. వాతవహనాడీ సంస్థానమునకు బలమునిచ్చు మహత్వపూర్ణమైన ఔషధము (Nervine Tonic) పక్షవాతము లేక ఏకాంగవాతముల యందు వారమునకు 4 దినములు ఔషధమిచ్చి 2 రోజులు విరామ మిచ్చుచూ పది వారములు క్రమముగా సేవించిన మంచి ఫలితమునిచ్చును.

మోతాదు : 30 మి.గ్రా. 50 మి.గ్రా. తేనె మరియు మహారాస్నాది క్వాథముతో ఇవ్వవలయును. 2.5 గ్రా.,

ప్యాకింగ్ : 1 గ్రా.

## లోహభస్మ (రసతరంగిణి)

రక్తవృద్ధికి ఈ భస్మము ప్రసిద్ధిచెందినది. రసాయనము, వాజీకరణము, యకృత్, ప్లీహల వృద్ధి, పాండు, కామిల, కుష్ఠము, కృమి, శోథ మేదోవృద్ధి మొదలగు వ్యాధుల యందు ఉపయోగించును. అధునికముగా ఇచ్చు లోహ ఔషధములు అగ్నిమాంద్యము మలబద్ధము మొదలగు వికారములను కలిగించును. కాని ఈ లోహ భస్మము అట్టి వికృతులను కలిగించక 2,3 నెలలు క్రమముగా సేవించిన నిస్సందేహముగా అత్యంత గుణకారిగా

నుండును. రక్తాల్పత గల స్త్రీలకు ఇది కాయకల్ప ఔషధమే.

మోతాదు : 60 మి.గ్రా. 375 మి.గ్రా. తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 10 గ్రా., 2.5 గ్రా.

## లోహభస్మ (శతపుటి)

ఈ భస్మము సాధారణ లోహభస్మము కన్న అధిక గుణవంతమైనది మోతాదు 60 మి.గ్రా. 375 మి.గ్రా. తేనెతో రోజుకు 2 సార్లు.

ప్యాకింగ్: 2.5 గ్రా.

## కాంత లోహ భస్మ

కాంతలోహము శ్రేష్ఠతమైనది. లోహభస్మ గుణము లన్నిమూ ఇందు అధిక ప్రమాణములో నుండును.

మోతాదు: 50 మి.గ్రా. 200 మి.గ్రా తేనెగాని లేక రోగానుసారము తగిన అనుసారనము.

ప్యాకింగ్: 2.5 గ్రా.

## శంఖ భస్మ (సిద్ధయోగ సంగ్రహ)

ఈ భస్మము యకృత్ ప్లీహ రోగములు సంగ్రహిణి. ప్రవాహిక అమ్లపిత్తము, గుల్మము, వాతజశూల అజీర్ణము మొదలగు ఉదర రోగములయందు గుణకారి. పిత్తశామకము, ఆధ్యాన ఆటోపలను తగ్గించి ఉదర గత వాయువును నిర్మూలించును.

మోతాదు : 375 మి.గ్రా. 750 మి.గ్రా తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 10 గ్రా., 5 గ్రా.

## శృంగభస్మ (రసతరంగిణి)

ఈ భస్మము హృదయశూల పార్శ్వశూల (న్యుమోనియా ప్లూరసీ) ఇన్ఫ్లూయంజ (వాతశ్లేష్మ జ్వరము), జలుబు, రాజయక్ష్మ ప్రారంభిక అవస్థ,

దంతవ్యాధులు, బలహీనతచే కలిగిన కాస మొదలగు వ్యాదులలో అధిక గుణవత్తరము ''బాలశోష'' మొదలగు బాలుర వ్యాధులలో గుణకారి. ఊపిరి తిత్తులలో కలుగు వ్యాధులలో క్రమముగా 2,3 వారములు సేవించుటచే నిశ్చయముగా గుణము కనిపించును.

మోతాదు : 360 మి.గ్రా. 750 మి.గ్రా తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 10 గ్రా., 5 గ్రా.

## స్ఫటికభస్మ (ఆయుర్వేద సారసంగ్రహ)

విషమజ్వరము (మలేరియా) కాస, కోరింత దగ్గు, రక్త పిత్త, ముఖ పాక మొదలగు వ్యాధులలో గుణకారి. ఇది రక్త స్రావమును అరికట్టును. వ్రణ శోధకము. ఈ భస్మమును నీటిలో కలిపి ఆ ద్రవమును దూదితో తడిపి దానిని యోని యందుంచిన శుక్రాణువులు నశించి గర్భనిరోధకముగా పనిచేయును.

మోతాదు : 200 మి.గ్రా. 500 మి.గ్రా. తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 10 గ్రా.

## స్వర్ణ భస్మ (సిద్ధయోగ సంగ్రహ)

ఈ భస్మము శారీరక మరియు మానసిక శక్తివర్ధకముగా పనిచేయును. హృదయము మరియు మస్తిష్కమునకు బలము కలుగజేయును. విషహరముగా పనిచేయును. దీర్ఘ వ్యాధులందు గుణకారి. రాజయక్ష జీర్ణ జ్వరము, శ్వాస, కాస, గండమాలల యందు పనిచేయును. జీవన చరమావస్థలో జీవనశక్తిని కలిగించును. ధాతుక్షయము మరియు స్నాయు దౌర్బల్యము నివారించును. సంవత్సరముల తరబడి బాలురలో వృద్ధులలో పీడించు ఏ ఇతర ఔషధములకు శమించని మంద జ్వరమునందు నియమానుసారము 1 మాసము సేవించిన గుణము కనిపించును.

మోతాదు : 30 మి.గ్రా 125 మి.గ్రా తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 1 గ్రా., 500 మి. గ్రా. 125 మి.గ్రా

## స్వర్ణమాక్షిక భస్మ (రసేంద్ర సారసంగ్రహ)

పాండు, కామిలరోగములను శమింపచేసి రక్తవృద్ధిని కలిగించును. పిత్త వికారములు నిద్రానాశము, మస్తిష్క దౌర్బల్యము, నేత్రవ్యాధులు, వమనవములు అమ్లపిత్తము, రక్తార్శస్సు మరియు విష వికృతులను, తొలగించును. బాల రోగములలో గుణకారి. నిద్రలేమితో బాధ పడువారు, ఈ ఔషధము క్రమముగా 2,3 నెలలు సేవించిన గుణము కనిపించును.

మోతాదు : 100 మి.గ్రా 400 మి.గ్రా తేనెతో దినమునకు రెండుసార్లు. 10 గ్రా., 2.5 గ్రా.

## హాజరుల్ యహూద భస్మ (సిద్ధయోగ సంగ్రహ)

ఇదే అశ్మరీ (మూత్రాశయములో జనించు రాళ్ళు) రోగము యొక్క ప్రారంభిక అవస్థలో ఇచ్చిన, రాయిని కరిగించి బయల్వెడలించును. మూత్రావరోధ మూత్ర కృచ్ఛ్రములందు గుణకారి- నియమాను సారము కొంతకాలము సేవించిన గుణము కనిపించును. 10 గ్రా.

## గోదంతీ భస్మ (హరితాళ) (సిద్ధయోగ సంగ్రహ)

దీనిని గోదంతీ హరతాళ బస్మమని కూడా అందురు. ఇది విషమ జ్వరమందు శీఘ్రముగా పనిచేయును. జలుబు, కాస, శిరశ్శూల, ఇన్ఫ్లూయింజా జ్వరములను తగ్గించును. ఏ మాత్రమూ ప్రమాద భరితము కాని అత్యుత్తమ ఔషధము. క్రమముగా కొంతకాలము వాడుట మంచిది.

మోతాదు : 150 మి.గ్రా 500 మి.గ్రా. తేనెతో సేవించి దశమూల క్వాథము ఇవ్వవలయును.

ప్యాకింగ్: 10 గ్రా., 5 గ్రా.

# బైద్యనాథ్

## కూపీ పక్వ రసాయనములు

సంస్కారములచే శుద్ధి చేయబడిన పాదరసమునే కూపీ పక్వ రసాయనౌషధముల యందు చేర్చుట వలన బైద్యనాథ్ ఔషధములు అధిక గుణవత్తరములై యుండును. ద్విగుణ, షడ్గుణబలి జారణములు ఒకదాని కన్న ఒకటి శక్తివంతములుగా నుండును. కూపీ పక్వ రసాయనములు వైద్యుల సలహానుసరించి మాత్రమే వాడవలయును.

## తాళసింధూర (ఆయుర్వేద సారసంగ్రహ)

రక్తశుద్ధకి అత్యుత్తమ ఔషధము. వ్యాధిని కలిగించు కీటానాశకము. కఫోల్బణ సన్నిపాతమందు చయము చెందిన కఫమును నిర్మూలించును. హృదయము మరియు రక్తవహ స్రోతస్సులకు బలము కలుగజేయును. కుష్ఠు, వాత రక్తములనను పోగొట్టును. ఇస్నోఫఈలియా యందు ఉపయోగించును.

మోతాదు : 60 మి.గ్రా. 125 మి.గ్రా. దినమునకు రెండు సార్లు తేనెతో

ప్యాకింగ్ : 1 గ్రా.

## పూర్ణ చంద్రోదయ (ఆయుర్వేద సార సంగ్రహ)

ఇది ఉత్తమ పౌష్టిక రసాయనము, శారీరక, మానసిక బలహీనతల యందు శీతాంగము (చలువలు కమ్ముట) జీర్ణ కాసలందు గుణకారి - వాజీ కరముగా పనిచేయును. 21 దినములు క్రమముగా సేవించుటచే ఫలితము కనిపించును.

మోతాదు : 60 మి.గ్రా 125 మి.గ్రా వరకు దినమునకు రెండు సార్లు తేనెతో.

ప్యాకింగ్ : 2.5 గ్రా., 500 మి.గ్రా.

# మకర ధ్వజ

## (రసేంద్ర సారసంగ్రహ)

పాదరసముతో తయారు చేయబడిన ఔషధములలో శ్రేష్టమైనదిగా పరిగణింప బడుచున్నది. అనుపానభేదముచే అనేక వ్యాధులను నివారించును. బలము, కాంతులను వృద్ధి చేయును. సన్నిపాత జ్వరమునందు నాడీ గతి మందగించినపుడు కస్తూరి కలిపి గాని లేక కస్తూరి కలిసిన ఔషధముతో చేర్చి గాని ఇచ్చిన శ్రీఘ్రాతి శీఘ్రముగా పనిచేయును. దీర్ఘవ్యాదులు యందు ఆయా ఔషధములు ఇచ్చిన శీఘ్రముగా పనిచేయును.

మోతాదు : 60 మి. గ్రా. 125 మి. గ్రా. వరకు తేనె లేక రోగానుసారము తగు అనుపానము.

ప్యాకింగ్ : 20 T, 8 T

# సిద్ధ మకరధ్వజ

## (ఆయుర్వేద సారసంగ్రహ)

ఆయుర్వేదమునందు అత్యుత్తమ ఔషదము, అష్ట సంస్కారములు చేయబడిన పాదరసముచే తయారుచేయబడి, స్వర్ణము, ముత్యములు కలిసిన ఈ సిద్ధమకరధ్వజ శారీరక, మానసిక దుర్బలతలను పోగొట్టి నూతన శక్తి, స్ఫూర్తి కలిగించును. న్యూమోనియా, జలుబు, కఫము, కాస, శ్వాస శీతాంగము (చలువలు కమ్ముట) ధాతుదౌర్బల్యము, మధుమేహ వ్యాధులను నివారించును. వృద్ధులకు నూతన యవ్వనము ప్రసాదించును. హృదయ మునకు, నాడీమండలమునకు (Nervous System) శక్తిని కలిగించును. దీర్ఘకఠినవ్యాధులయందు శరీరమునకు బలము కలిగించి రోగనిరోధక శక్తిని కలిగించును.

మోతాదు : 60 మి. గ్రా. 100 మి. గ్రా. వరకు తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 2.5 గ్రా., 500 మి. గ్రా.

## సిద్ధమకరధ్వజ స్పెషల్ (ఆయుర్వేద సార సంగ్రహ)

పైన చెప్పబడిన సిద్ధమకరధ్వజ - స్పెషల్ గుణములనే కలిగి యుండును. మోతాదు : 60 మి.గ్రా. 100 మి.గ్రా. తేనెతో రెండు సార్లు.

ప్యాకింగ్ : 1 గ్రా., 500 మి.గ్రా.

## స్వర్ణ మకరధ్వజ

ముసలితనమును నిర్మూలించు అత్యుత్తమ ఔషధము 40 సం॥ల వయస్సు దాటిన తరువాత కలుగు శారీరక మానసిక బలహీనతల యందు మరియు యవ్వనమును సంరక్షించుటకు అత్యుత్తమ ఔషధము నశించుచున్న శరీరమునందు కొత్త ఉత్సాహము, శక్తిని కలిగించును. వృద్ధాప్యమునందు నిత్య నూతన ఉత్సాహము శక్తుల కొరకై ప్రతి నిత్యము 50 మి.గ్రా. మోతాదులో చ్యవన ప్రాశతో దినమునకు రెండు సార్లు సేవించవలయును.

ప్యాకింగ్ : 40T, 8 T

## మల్ల సింధూర (సిద్ధభైషజ్య మణిమాల)

ఇది అత్యంత తీక్షణమైన ఉష్ణవీర్యఔషధము. అందువల్ల పిత్త ప్రకృతి కలవారికి, తీవ్ర జ్వరము కలవారికి ఇవ్వరాదు. వాత కఫ వికారములు ఆమవాతము, పక్షవాతముల యందు గుణకారి. ధనుర్వాతము, యోషాపస్మారము (Hystirial) వృద్ధాప్యము వలన జనించిన దౌర్బల్యము, కఫయుక్తమైన శ్వాసయందు ఉపయోగకరమైనది. రక్త శోధకము.

మోతాదు : 30 మి.గ్రా. 125 మి.గ్రా. తేనెతో రెండు సార్లు.

ప్యాకింగ్ : 2.5 గ్రా.

## రజత సింధూర (రసేంద్ర సారసంగ్రహ)

రస రక్తాది సప్త ధాతువుల పోషణ చేసి హృదయము మస్తిష్కములకు శక్తి నిచ్చును. ఉదరమునందు వాయు సంచయము జరుగనివ్వదు. ప్రమేహ నాశకము.

మోతాదు : 30 మి.గ్రా. 125 మి.గ్రా. తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 2.5 గ్రా.

## రస సింధూర (రసేంద్ర సారసంగ్రహ)

ఇది ఉష్ణ వీర్యము, యోగవాహి, రసాయన గుణములను కలిగి యుండును. ఉరస్తోయ (ప్లూరసీ) (Pleurusy) న్యూమోనియా, సన్నిపాత, సంగ్రహిణి, కాస, శ్వాస మొదలగు రోగములను నివారించి, హృదయమునకు బలమును కలిగించి, శరీరమునకు బలము, కాంతి కలుగ జేయును.

మోతాదు : 30 మి.గ్రా. 125 మి.గ్రా తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 2.5 గ్రా.

## వ్యాధిహరణ రసాయనము (బసవరాజీయం)

ఉపదంశ, వ్యాది, సవామేహము మరియు వాని వల్ల వచ్చిన సంధి వాతము, వ్రణములు, పొడలు, రక్తదోశము, నాడీ వ్రణము, నేత్రవికారములు, గుదాంకురములు నివారించును.

మోతాదు : 125 మి.గ్రా. 250 మి.గ్రా. తేనెతో పాలు అనుపానముగా

ప్యాకింగ్ : 2.5 గ్రా.

## సమీర పన్నగరస (సిద్ధయోగ సంగ్రహ)

సన్నిపాతమునందు నాడీగతి పూర్తిగా మందగించినపుడు కఫ వృద్ధియందు అత్యుత్తమముగా పనిచేయును. స్నాయు మండలమునకు శక్తిని కలిగించును. శ్వాస వేగమును నియంత్రణ చేయును.

మోతాదు : 50 మి.గ్రా. 100మి.గ్రా తేనెతో

ప్యాకింగ్ : 2.5 గ్రా.

## సువర్ణ సమీర పన్నగరస

ఇది పక్షవాతము మరియు వాత వ్యాధులందు ఉత్తమ గుణకారి

మోతాదు : 50 మి.గ్రా.200 మి.గ్రా. తేనెతో రెండుసార్లు ప్యాకింగ్

ప్యాకింగ్: 1 గ్రా.

## స్వర్ణవంగ

ఇది శరీర దౌర్బల్యమును పోగొట్టును. మూత్రవ్యాధులందు గుణకారీ, పూయమేహమునందు అత్యుత్తమముగా పనిచేయును.

మోతాదు: 125 మి.గ్రా. 250 మి.గ్రా తేనెతో.

ప్యాకింగ్: 2.5 గ్రా.

# బైద్యనాథ్

## రస రసాయనములు

ఆయుర్వేద చికిత్స యందు రస- రసాయనముతో ప్రముఖ స్థానమును వహించి యున్నవి. రస-రసాయన ఔషధములు లేకున్న ఆయుర్వేదము పాశ్చాత్య వైద్య ధాటికి తట్టుకొని యుండెడిదికాదు. వైద్యుల వద్ద ముఖ్యమైన రస-రసాయనములు తప్పక ఉండవలయును. రసౌషధముల ప్రత్యేకత : రసౌషధములలో ప్రధానముగా పాదరసముగాని ఇంగలీకముగాని ఉండును. మా ఔషధ నిర్మాణ శాలయందు జాగ్రత్తగా శుద్ధి చేయబడిన పాదరసముగాని, ఇంగలీకముగాని ఔషధము లలో ఉపయోగించెదము. అల్లోపతీ ఔషధములతో దీటుగా ఆయుర్వేద ఔషధములు విశిష్ట గుణములు కలిగియుండవలయుననే సంకల్పముతో శాస్త్రోక్తముగా తయారుచేయుట మా ప్రత్యేకత. తగు ధరలో ప్రామాణికమైన మందులు కావలయునన్న మా రస-రసాయనములనే కోరుకొనగలరు.

## సేవన విధి

అనుపానము మరియు గుణముల గురించి వివరముగా తెలిసికొన వలయునన్న ప్రతి రసౌధముల ప్యాకింగ్‌లో ఈ ఔషధ సేవననిధి గూర్చి, పథ్యాపథ్యములు మోతాదు మొదలగు వివరములు పొందుపరచబడినవి.

## అమర సుందరీవటీ రస

## (కస్తూరియుక్త) (యోగ చింతామణి)

అన్ని విధములైన వాత వ్యాధులు శ్వాస, కాస, అధ్యానము మొదలగు వ్యాదులయందు దీనిని వాడుట మంచిది.

మోతాదు 1. లేక 2 మాత్రలు తేనెతో వాడి పాలను సేవించ వలయును.

ప్యాకింగ్ - 40 T

## అర్శకుఠాన రస (రసేంద్ర సారసంగ్రహ)

దీనిని నియమ ప్రకారము సేవించుట వలన విరేచనము సరిగా అగును. మరియు అర్శస్సు పడిపోవును. రక్తార్శస్సు, అర్శస్సు రెండింటిలోనూ కూడా ఉపయోగించును.మోతాదు : 1 నుండి 2 మాత్రలు తేనె లేక నీరు లేక పాలతో.

ప్యాకింగ్ : 40 T, 20 T.

## అశ్వకంచుకీ రస (సిద్ధయోగ సంగ్రహ)

## (జయపాల్ యొక్క)

దీనిని ఉదర రోగముల యందు విరేచనము అగుటకు ఇచ్చెదరు. జ్వరమును కూడ తగ్గించును. బలహీనులు మరియు బాలురు కూడ వాడవచ్చును.

మోతాదు : 1 / 4 నుండి 1 మాత్రవరకు నీటితో.

ప్యాకింగ్ : 20 T

## ఆనందభైరవి రస

## (జ్వర) (రసేంద్ర సారసంగ్రహ / (కాస))

ఆనంద భైరవిరస అన్ని జ్వరములయందునూ ఇవ్వవచ్చును.

సాధారణ జ్వరమునందు ఉదయము, సాయంత్రము 1 మాత్ర చొ న సేవించిన జ్వరము తగ్గును. జ్వరతీవ్రత అధికముగా నుండి రోగి బాధపడుచుండిన ఆనందభైరవిరస మాత్ర 1, 10 గ్రా అల్లపురసము, 12 గ్రా తేనె ఈ మూడు కలిపి 4 గంటలకు ఒక పర్యాయము ఇచ్చుచుండిన జ్వరతీవ్రత తగ్గును. జలుబు, రొంప యున్నయెడల ఒక ఆనంద భైరవిరసమాత్ర తమలపాకురసముతో కలిపి 4 గం లకు ఒకసారి ఇచ్చుచున్నయెడల తగ్గును.

మోతాదు : 1., 2 మాత్రలు తేనె లేక తులసిరసముతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 80 T, 20 T.

# అమవాతారి రస

## (భైషజ్య రత్నావళి)

అమవాతము వల్ల కరిగిన కీళ్ళనొప్పులు మరియు వాపుల యందు పనిచేయును.

మోతాదు : 1 నుండి 3 మాత్రలు వేడి నీళ్ళతో.

ప్యాకింగ్ : 40 T

# ఆరోగ్యవర్ధినీ వటి (రస)

## (రసరత్న సముచ్ఛయ)

ఇది ఒక ప్రసిద్ధ ఆయుర్వేద యోగము. ఇది అజీర్ణము, మలావరోధము, రక్త వికారములు, పాండు, రక్తాల్పత, కామిల, జ్వర, శోధయకృత్ రోగము, జలోదరము (Ascites) మరియు మధుమేహ (Daibities) వ్యాధులు యందు పనిచేయు ఉత్తమ ఔషధము బాలురలో వచ్చు యకృత్ వృద్ధి (బల్ల) యందు శీఘ్రముగా పనిచేయును. యకృత్ పచ్చబడి క్రమముగా బలహీన మగుచుండును. అటువంటి పరిస్థితిలో ఆరోగ్య

వర్ధినివటి సేవింటుటవలన మంచి గుణము కనిపించును. శాస్త్రమునందు ఆరోగ్యవర్ధిని కుష్ఠ ప్రకరణము నందు చెప్పబడిననూ అనుభవము నందు యకృత్ వృద్ధి, అత్యుత్తమముగా పని చేయుచున్నది.

మోతాదు : 1 నుండి 3 మాత్రలు రోజుకు రెండు సార్లు పాలు లేక నీటితో.

ప్యాకింగ్ : 80 T, 40 T, 20 T.

## ఇచ్ఛాభేదీ రస (రసేంద్ర సారసంగ్రహ) (జయపాల్ యుక్త)

ఇది నేపాళము కలిపిన ఔషదము. ఉదరము నందు సంచితమయిన మలమును వెడలించును. తీవ్ర విరేచనకారి (Drastic Furgative) సుకుమారులు, బాలురు, గర్భిణులు దీనిని సేవించరాదు.

మోతాదు : 1, 2 మాత్రలు చల్లని నీటితో. విరేచనములు కట్టుటకు పెరుగు లేదా పెరుగు అన్నము తినిపించవలెను. వేడి నీరు సేవించవలయును.

ప్యాకింగ్ : 10 గ్రా., 2.5 గ్రా.

## ఉన్మాద-గజ-కేసరీ రస (భైషజ్య రత్నావళి)

ఇది తీక్షణ మైన ఔషధము, ఉన్మాదము, అపస్మారము, కఫజన్య మస్తిష్క వికృత్లు, అతినిద్రా, తంద్ర (కునికిపాటు)లలో గుణకారి.

మోతాదు : 50 మి.గ్రా. 150 మి.గ్రా. తగరు, జటా మాంసీ మరియు శంఖ పుష్టీ కషాయముతో.

ప్యాకింగ్ : 40 T.

## ఏకాంగ వీరరస (రసరాజ సుందర)

పక్షవాతము (Hemiplegia) గృధ్రసీ (Sciatica) అర్దితవాతము ఊర్ధ్వగవాతము మొదలగు తీవ్రమైన వాత వ్యాధులతో మరియు వీటి వలన కలుగు దౌర్బల్యమునందు ప్రత్యేకమయిన ఔషదము.

మోతాదు : 1,2 మాత్రలు, రోజుకు 2,3 సార్లు.

ప్యాకింగ్ : 40 T, 20 T.

## కఫకర్తరీ రస (ఆరోగ్య ప్రకాశ)

శ్వాస, కాసల యందు సంచయమువు చెందిన కఫమును బయల్వెడలుచును.

మోతాదు : 250 మి.గ్రా. వరకు తేనెతో.

ప్యాకింగ్ : 40 T

## కర్పూర రస (భైషజ్య రత్నావళి)

నీళ్ళ విరేచనములు, సంగ్రహిణి, రక్త విరేచనముల యందుపయోగించును.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు మూడు మార్లు తేనె లేక నీటితో.

ప్యాకింగ్ : 20 T.

## కస్తూరి భైరవరస (భైషజ్య రత్నావళి)

మంథర జ్వరము (Typhoid Fever) సన్ని పాతముల యందు ప్రలాపము, నిద్రలేకపోవుట మొదలగు వికృతుల యందు సూతిక రోగముల యందు విశేష గుణకారి.

మోతాదు : 1 మాత్ర తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 8 T

## కస్తూరి భైరవరస బృహత్
## (సువర్ణ మోతీయుక్త) భైషజ్య రత్నావళి)

కస్తూరి భైరవరసము కంటె అధిక గుణవంతమైనది. నాడీగతి దుర్బలమైనపుడు దీనిని వాడవలయును.

మోతాదు 1 మాత్ర తేనె మరియు అల్లపు రసముతో రోజుకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 8 T, 4 T

## కామదుధా రస

## (మోతీయుక్త)

ఇది అమ్లపిత్తమందు పనిచేయు విశిష్టమైన ఔషదము. పిత్త వికృతులు, రక్తపిత్తము, భ్రమ, ఉదర శూలల యందు గుణకారి. గర్భిణీలకు కలుగు వాంతులు రక్తస్రావము నందు పనిచేయును.

మోతాదు : 250 మి.గ్రా. 500 మి.గ్రా. తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ 40 T, 20 T, 8 T.

## కామదుధా రస

ముత్యములు తప్ప మిగిలిన యోగమంతము పై ఔషధమే. దీనిని 2,3 నెలలు అమ్లపిత్త రోగి సేవించిన మంచి గుణము కనిపించును. పై కామదుధ గుణములన్నియు అల్పప్రమాణములో కలవు.

ప్యాకింగ్ : 80 T, 40 T.

## కుమార కళ్యాణరస

## (స్వర్ణమోతీ యుక్త) (భైషజ్య రత్నావళి)

ఇది బాలురలో వచ్చు కస, శ్వాస, శారీరక క్షీణత, వమనములు పక్కరోగములలో, అత్యుత్తమముగా పనిచేయును. మసూరిక, రోమాంతకలో గుణకారి. పసిపిల్లలకు బలవర్థకముగా పనిచేయును.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండుసార్లు తేనెతో.

ప్యాకింగ్ : 8 T, 4 T.

# క్రవ్యాద రస

## (భైషజ్య రత్నావళి)

ఒక ప్రత్యేక నిర్మాణ పద్ధతి ద్వారా ఈ ఔషదము తయారగును. అజీర్ణమునకు సరి అయిన ఔషదము. ఆలస్యముగా పచనమగు గురు ఆహారములను కూడా శీఘ్రముగా పచనమగునట్లు చేయును. పాచక పిత్తమందలి పాచకంశములను (Engyme) పెంపొందించును. అగ్ని మాంద్యము వల్ల జనించు రోగములకు ఉత్తమ ఔషదము.

మోతాదు : 1,2 మాత్రలు భోజనము తరువాత అల్లపు రసము లేక నీటితో.

ప్యాకింగ్ : 20T.

# కృమికుఠార రస (రసామృత)

ఈ ఔషదవము కృమిరోగవము (నులుపురులుగులు) నందు ఉపయోగకారి. పిల్లలో ఈ వ్యాధి అధికముగా వచ్చుచుండును. అట్టి వారికి ఈ ఔషధము ఈయవలయును.

మోతాదు : 1 మాత్ర చొ॥న దినమునకు రెండు సార్లు తేనెతో, పిల్లలకు ఈ మాత్ర సగము చొ॥న ఉదయము, సాయంత్రము తేనె, నీరు లేక ఖురాసాని వాము కషాయముతో ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 10 గ్రా. 2.5 గ్రా.

# గంధక రసాయన

అన్ని విధవములైన రక్తదోషవములు, శుద్ధిచేయని పాదరస వముపయోగించుటచే కలుగు దురదలు వ్రణవములు మెు చర్మ రోగములయందు పని చేయును. ఆకలిని పెంచును. రక్తశుద్ధి చేయును

మోతాదు : 500 మి.గ్రా. 1 గ్రా. తేనెతో

ప్యాకింగ్ : 40T

## గర్భపాల రస (రసయోగ సాగర)

గర్భ ధారణవలన కలుగు వాంతులు, అరుచి, జ్వరము మొదలగు లక్షణములయందు పనిచేయును. గర్భపోషణచేసి గర్భిణికి బలము కలిగించును. గర్భిణి ప్రసవము జరుగువరకు క్రమముగా సేవించుటచే గర్భపాతాదులు జరుగక సుఖ ప్రసవమగును. ఆరోగ్యవంతమైన శిశువు జనించును.

మోతాదు : 1 మాత్ర దినమునకు రెండు సార్లు పాలతో.

ప్యాకింగ్ : 80 T, 40 T.

## చతుర్ముఖ రస (సువర్ణ యుక్త)(భైషజ్య రత్నావళి)

అన్ని విధములైన వాతవికృతులయందును, హృదయరోగము స్నాయు మొదలగు వ్యాధులలో గుణకారి. శారీరక దౌర్బల్యమును తగ్గించును రక్త చాపము Law-B.P) తగ్గినప్పుడు వాడతగినది.

మోతాదు : 60 మి.గ్రా. 125 మి.గ్రా. తేనెతో

ప్యాకింగ్ : 80 T, 40 T.

## చతుర్భుజ రస (సువర్ణ అయుక్త)
## (రసేంద్ర సారసంగ్రహ)

అన్ని విధములైన వాతవికృతులలో, హృదయరోగము, స్నాయు దౌర్బల్యము, ఉన్మాదము మొదలగు వ్యాధులలో గుణకారి.

ప్యాకింగ్ : 8 T, 4 T.

## చంద్రామృత రస (సిద్ధయోగ సంగ్రహ)

అన్ని విధములైన కాసలయందు ఉపయోగించును. జలుబు, గొంతు నొప్పి, ఫ్లూ జ్వరము, జీర్ణ జ్వరములయందు శ్వాస (దమ్ము) అగ్నిమాంధ్యము లందు గుణకారి - శుష్కకాస (పొడిదగ్గు) యందు విశేషముగా పని చేయును

(Toncilities) యందు వాపు తగ్గించును. క్రమము తప్పక సేవించినసే గుణము కనిపించును.

మోతాదు : 1 మాత్ర చొ న దినమునకు రెండు, మూడు సార్లు తేనెతో సేవించవలయును.

ప్యాకింగ్ : 40 T.

## చింతామణి చతుర్ముఖ రస (సువర్ణ యుక్త)

## (భైషజ్య రత్నావళి)

ఇది హృదయరోగములు, శారీరక దౌర్బల్యము, మానసిక దౌర్బల్యము మొదలగు వ్యాధులయందు శీఘ్రముగా పనిచేయును.

మోతాదు : 20 మి. గ్రా. నుండి 60 మి. గ్రా. తమలపాకు రసముతో కలిపి ఇవ్వవలెను.

ప్యాకింగ్ : 4 T

## చౌసఠ ప్రహరీ పీపల్

జ్వరయుక్తకాస, కఫము, శ్వాస, అగ్ని మాంద్యము, దౌర్బల్యలందు ఈ ఔషధము ప్రత్యేకముగాగాని, వసంత మాలతీ రసముతో గాని ఇవ్వవలయును.

మోతాదు : 150 గ్రా. నుండి 300 మి. గ్రా. వరకు తేనెతో.

ప్యాకింగ్ : 80 T.

## చింతామణి రస

## (సువర్ణమోతీ అంబర్ కలిసినది)(సిద్ధయోగ సంగ్రహ)

మానసిక దౌర్బల్యము పోగొట్టి, నిద్రలేమి, హృద్రోగము, దడ, భ్రమ మొదలగు వానిని నివారించును.

మోతాదు : 20 మి. గ్రా. నుండి 65 మి. గ్రా. వరకు తమలపాకులతో కలిపి ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 8 T.

# జయమంగళ రస (స్వర్ణము కలిపినది)

## (భైషజ్య రత్నావళి)

అన్ని రకముల పురాణ (జీర్ణ) జ్వరము ధాతుగత జ్వరములు వాని ఉపద్రవములు దీనిని సేవించుటవలన శమించును. శరీరమునకు పుష్టిని కలిగించును.

మోతాదు : 1 మాత్ర చొ న గుడూచీ సత్వము (తిప్పసత్తు) మరియు తేనెతో.

ప్యాకింగ్ : 4 T.

# జవహర్ మోహర నెం. 1

## (ఆయుర్వేద సార సంగ్రహ)

హృదయమునకు సంబంధించి గుండె దడ గాబరా మొదలగు హృదయరోగములన్నింటిని మంచి ఫలితములిచ్చును.

మోతాదు : 125 మి.గ్రా. తేనెతో రోజుకు రెండు మూడు సార్లు,

ప్యాకింగ్ : 8 T

# తారకేశ్వర రస

## (భైషజ్య రత్నావళి)

అతిమూత్రము మరియు ఇతర ప్రమేహ వ్యాధులయందు అత్యుత్తమముగా పనిచేయును.

మోతాదు : 1 మాత్ర చొ న నీటితో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 20 T

# తాలకేశ్వర రస (ఆయుర్వేద ప్రకాశ)

పామ, కండూ (దురద) మొదలగు చర్మ వ్యాదులు మరియు రక్త దోషములను తగ్గించును.

మోతాదు: 125 మి.గ్రా. నుండి 250 మి.గ్రా. వరకు సురక్తా 2 చెంచాలు. 8 చెంచాల నీటితో కలిపి అనుపానముగా సేవించ వలయును.

ప్యాకింగ్ : 20 T

## త్రిభువనకీర్తి రస

## (యోగరత్నాకర)

ఇది ఉష్ణవీర్యము కలిగిన జ్వరఘ్న ఔషధము. అన్ని విధములైన తరుణ జ్వరములయందు విశేషముగా వాత-కఫ జ్వరములయందు ఉత్తమముగా పనిచేయు ఔషధము. జ్వరతీవ్రతను తగ్గించి హృదయ గతిని తగ్గించును. ఇన్ఫ్లూయంజా జ్వరము నాడీ గతులను నియంత్రణ చేయును. స్వేదమును కలిగించి జ్వరము నందు అత్యుత్తమముగా పని చేయును. అంగమర్దము (ఒడలు నొప్పులు) తీవ్రజ్వరము, జలుబు, దగ్గు, గొంతునొప్పి, పొడి దగ్గులయందు విశేషముగా వాత, కఫ జ్వరమునందు అధిక గుణవంతముగా నుండును.

మోతాదు : 1 మాత్ర చొ న తులసిరసము మరియు తేనె కలిపి దినమునకు రెండు మూడుసార్లు.

ప్యాకింగ్ : 80 T, 40 T.

## త్రైలోక్య చింతామణి

## (స్వర్ణము, ముత్యముతో కలిసినది) భైషజ్య రత్నావళి)

తరుణ, దీర్ఘ వాతవ్యాధుల యందు గుణకారి. బలమును కలిగించును. ధాతుపుష్టిని కలిగించును. రసాయనము, పక్షవాతము, వృద్ధాప్యము వల్ల వచ్చిన బలహీనతలను తగ్గించును.

మోతాదు : 1 మాత్ర చొ న దినమునకు రెండు సార్లు ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 8 T, 4 T.

## నష్ట పుష్పాంతక రస

## (రస చండాంశు)

ఇది తీక్ష్ణమైన, ఉష్ణమైన ఔషధము. స్త్రీల కుపయోగించును. దీనిని సేవించుటవలన ప్రదరరోగము, కష్టార్తవరోగము (Amenorrhea) తగ్గును సంతానము కలిగిన తరువాత నెలకొకసారి రోజుకి 1 లేక 5 మాత్రలు చొ॥న 7 రోజులు వరకు సేవించుచుండిన మరల శీఘ్రముగా సంతానము కలుగదు.

మోతాదు : 1 మాత్ర చొ న వేడినీటితో దినమునకు రెండు సార్లు.

ప్యాకింగ్ : 40 T

## నాగార్జునాభ్ర రస

## (రసేంద్ర సారసంగ్రహ)

భ్రమ, హృదయ దౌర్బల్యము, దడ, శూల మొదలగువానిలో గుణకారి, శక్తిని కలిగించును. శరీరమునకు కాంతిని కలిగించును. నిమ్న రక్తచాపము (Low B.P.) నందు పనిచేయును. అమ్ల పిత్తమునందు (Acid-ity) ఉదరదాహమను తగ్గించుటలో అద్భుతమైన ఔషధము.

మోతాదు : 1 మాత్ర చొ న తేనెతో దినమునకు 2, 3 సార్లు.

ప్యాకింగ్ : 20 T.

## నిత్యానంద రస (భైషజ్య రత్నావళి)

## (తామ్ర బస్మ యుక్త)

ఇది శ్లీపదవ్యాధి (బోదకాలు) యందు అత్యుత్తమముగా పనిచేయును కఫవాతజన్యశోథ, అండవృద్ధి మొదలగు వ్యాధులయందు కూడ పనిచేయును.

మోతాదు : 1 లేక మాత్రలు రోజుకు 2, 3 సార్లు వేడినీళ్ళతో

ప్యాకింగ్ : 40 T, 20 T.

## పూర్ణచంద్ర రస (భైషజ్య రత్నావళి)

బల, వీర్య, శక్తివర్థకము. దీనిని సేవించుట వలన శరీరపుష్టి కలిగి స్నాయుమండలము శక్తివంతమగును.

మోతాదు : 1,5 మాత్రలు తేనెతో.

ప్యాకింగ్ : 20 T.

## పూర్ణ చంద్ర రస బృహత్

## (స్వర్ణ యుక్త) భైషజ్య రత్నావళి)

ఇది పై పూర్ణచంద్ర రసముకన్న అధిక గుణవత్తరము. హృదయ మస్తిష్క దౌర్బల్యమును పోగొట్టును.

మోతాదు : 1,2 మాత్రలు తేనెతో.

ప్యాకింగ్ : 20 T, 8 T.

## ప్రతాప లంకేశ్వర రస

## (యోగరత్నాకరము)

ఇది సూతికా రోగముల యందు ఉత్తమ ఔషధము. దీనిని సేవించుట వలన సూతికులకు కలుగు అనేక బాధలు శమించును. సూతికా జ్వరముకాస, ధనుర్వాతము, దంతబంధము, ఉన్మాదము, సన్నిపాతము, అతి సారము సంగ్రహిణి మొదలగు రోగములు, వాని ఉపద్రవముల యందు దీనినుపయోగించుటవల్ల గుణము కల్గును. దీనిని సేవించుటవలన గర్భాశయమునందు సంచయమవము నొందిన దుష్టరక్తము స్రవించి గర్భాశయముశుద్ధి అగును.

మోతాదు : 1,2 మాత్రలు ఉదయం, సాయంత్రం అల్లపురసం తేనెతో ఇచ్చి దశమూల, ఇచ్చిన విశేషముగా పనిచేయును.

ప్యాకింగ్ : 20 T.

# ప్రదరాంతక రస (భైషజ్య రత్నావళి)

ఇది స్త్రీలకు జనించు అన్ని ప్రదర వ్యాధుల యందు గుణకారి. దీనిని సేవించుట వలన గర్భాశయ బలహీనత తగ్గును.

మోతాదు : 1 మాత్ర తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 80 T, 40 T.

# ప్రవాళపంచామృత (మోతీయుక్త)

# (ముత్యము కలిసినది) యోగరత్నాకర

పిత్తాశయము, క్లోమ, యకృత్ ప్లీహకార్యముల యందు దీనిప్రభావము అధికముగానుండును. పిత్తవికారములయందు దీనితో ఏదైన సామ్య ఔషదము కలిపి ఇవ్వవలయును. జల్మ, ఉదర, ప్లీహ అగ్ని మాంద్యము ప్రమేహము, మూత్రరోగము అశ్మరీ హృదయరోగము అజీర్ణము మరియు బాలగ్రహముల యందు గుణకారి - పిత్తదోష నియంత్రణ చేయును. పిత్త వికృతి వల్ల జనించిన ఆమ్లపిత్త, అంత్రదాహ, కంఠదాహ, అమ్లోద్గార మొదలగు ఉపద్రవములు శమింపజేయును. పిత్త శామకము, రక్తవర్ధకము.

మోతాదు : 125 మి.గ్రా. 240 మి.గ్రా.తేనె గులకందలేక ఆమ్లకీమురబ్బాతో దినమునకు రెండుసార్లు సేవించవలయును.

ప్యాకింగ్ : 20 T, 8 T.

# బంగేశ్వర రస బృహత్

# (సువర్ణ మోతీ యుక్త) భైషజ్య రత్నావళి)

అన్ని విధములైన ధాతు బలహీనతలతో పనిచేయును. అత్యంత పౌష్ఠికము, ఓజోవర్ధకము.

మోతాదు : 30 మి.గ్రా. 150 మి.గ్రా. తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 20 T, 8 T

# వసంత కుసుమాకర రసం

## (సువర్ణ మోతీ యుక్త) ( భాషజ్య రత్నావళి)

ఖరీదైన ద్రవ్యములతో తయారు చేయబడిన ఉత్తమమైన రసాయనము. స్త్రీ, పురుషులకు కలుగు జననేంద్రియ సంబంధమైన వ్యాధులను శమింప చేయును. శరీరమును పుష్టిగ చేసి ఆరోగ్యముగానుంచును. బహుమూత్రము మరియు మధుమేహ వ్యాదియందు గుణకారి. మధుమేహము నందు కలుగు ఉపద్రవములనన్నింటినీ శమింపచేయును. మధు మేహవ్యాది కలిగిన వారు క్రమము తప్పక నియమపూర్వకముగ వాడుట ఉత్తమము. హృదయమునకు, మస్తిష్కమునకు బలము కలిగించును.

మోతాదు : 1 మాత్ర చొప్పున తమలపాకు సేవించి పాలు త్రాగవలయును.

ప్యాకింగ్ : 20, 8 T, 4 T.

# బసంత తిలక రస

## (సువర్ణ మోతీయుక్త) భైషజ్య రత్నావళి)

ఇది ప్రమేహము బహుమూత్ర వ్యాధులను శమింపచేయును. ధాతువృద్ధిని చేయును.

మోతాదు : 1 మాత్ర పాలతో.

ప్యాకింగ్ : 8 T

# బసంత మాలతీ రస

## (సువర్ణ మోతీ యుక్త) (భైషజ్య రత్నావళి)

రాజయక్ష్మ జీర్ణ జ్వరము, కాసదౌర్బల్యముల యందు గుణకారి. హృదయ రోగమునందు గుణకారి, ఏ వ్యాధి లేకపోయిననూ రసాయనముగా సేవించదగిన ఔషధము.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండు సార్లు సీతోఫలాది చూర్ణముతో మరియు తేనెతో.

ప్యాకింగ్ : 20 T, 8 T

## +A బహుమూత్రాంతక రస (భైషజ్య రత్నావళి)

మూత్రము ప్రమాణము తగ్గించును.

మోతాదు : 1,2 మాత్రలు రెండుసార్లు పాలతో.

ప్యాకింగ్ : 20 T, 10 T

## బాలరోగాంతక రస (భైషజ్య రత్నావళి)

బాలురకు కలుగు వ్యాదులకు ఉత్తమ ఔషధము. సన్నిపాతమ జ్వరము, ఆమదోషము, నీళ్ళవిరేచనములు, కాస, జలుబు, ఆయాసము, మరియు దంతములు వచ్చు సమయమున కలుగు వికృతులు తగ్గును.

మోతాదు : 1 మాత్ర చొప్పున తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 60 T

## బాలర్క రస (కేసర గోరోచనయుక్త)
## (సిద్ధయోగ సంగ్రహ)

బాలురకు కలుగు వాత, కఫరోగములు, అతిసారము, కృమి జ్వరము, కాస వమనములందు గుణకారి.

మోతాదు : 1,2 మాత్రలు తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 4 T

## బోలబద్ధ రస (బృహన్నిఘంటు రత్నాకర)

అన్ని విధములైన రక్తస్రావములందు గుణకారి, అర్శస్సుయందు అత్యంత గుణకారి.

మోతాదు : 1,2 మాత్రలు పాలు లేక నీటితో దినమునకు 2,3 సార్లు అవసరమునుబట్టి.

ప్యాకింగ్ : 80 T, 40 T

## మకరధ్వజ గుటికా సువర్ణయుక్త

## (భైషజ్య రత్నావళి)

ఇది అత్యంత వాజీకరణము, బలవీర్యవర్ధకము, పౌష్టిక రసాయనము దీనిని సేవించుటవలన క్షీణించిన ధాతువు వృద్ధి చెందు శరీరభారము పెంచును, మానసికబలము కలిగించి నిద్రను పట్టించును.

మోతాదు : 1 మాత్ర చొప్పున వెన్న శర్కరలతో ఉదయము సాయంత్రము దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 20 T

## మన్మథ రస

## (రసేంద్రసారసంగ్రహ)

బలము కలిగించును. వీర్యవృద్ధి చేయును.

మోతాదు : 1 నుండి 3 మాత్రల వరకు పాలతో.

ప్యాకింగ్ : 40 T

## మహజ్వరాంకుశ రసము

## (రసేంద్ర సారసంగ్రహ)

విషమజ్వరము, జీర్ణజ్వరములయందు జ్వరమును తగ్గించును. మలేరియా జ్వరమునందు కూడా పనిచేయును.

మోతాదు : 1 మాత్ర దినమునకు మూడుసార్లు తేనె లేక నీటితో

ప్యాకింగ్ : 80 T, 20 T.

## మహలక్ష్మి విలాస రస

## (సువర్ణ యుక్త) (భైషజ్య రత్నావళి)

ఇది పుప్పుసముల బలహీనత, తరచుగా వచ్చు జలుబు, పడిశము, న్యుమోనియా, ఇన్‌ఫ్లుఎంజా జ్వరములయందు గుణకారి.

మోతాదు : 1 మాత్ర 2,3 సార్లు తమలపాకుతో వ్వవవలెను.

ప్యాకింగ్ : 8 T, 4 T.

## మహలక్ష్మి విలాస రస (శిరో)

జలుబు, పడిశవము, దుష్టప్రతిశ్యాయవము, నాసార్బుదవము, (sinus) మరియు శిరోరోగములయందు గుణకారి.

మోతాదు : 1,2 మాత్రలు తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 40 T, 20 T

## మహవాత విధ్వాంసన్ రస

## (రస చండాంశు)

కఠిన వాతవ్యాధులు, అంగశైథిల్యము, దౌర్బల్యము, గ్రంథిక సన్నిపాతము (ప్లేగు) ఆమవాతము మొదలగు వ్యాధులయందు ప్రసిద్ధి చెందిన ఔషధము.

మోతాదు : 1 మాత్ర దినమునకు రెండు సార్లు తేనెతో.

ప్యాకింగ్ : 80 T, 20 T

## మహమృగాంక రస

## (సువర్ణ–మోతీయుక్త) (భైషజ్య రత్నావళి)

పురాణజ్వరవము, కాసలయందు ప్రఖ్యాతి గాంచిన ఔషధవము. పుప్పుసము మొదలగు శ్వాసకోశ సంస్థానమునకు చెందిన వికృతులను, శమింపచేసి సక్రమముగా పనిచేయునట్లు చేయును.

మోతాదు : 125 మి.గ్రా. దినమునకు రెండు సార్లు తేనెతో.

ప్యాకింగ్ : 8 T.

## ముక్తాపంచామృత రస (మోతీయుక్త) (రసామృత)

ఇది హృదయవము, మస్తిష్కవము, రసవాహినులకు బలవము కలిగించును. మరియు మానసిక శాంతిని కలుగజేయు ప్రసిద్ధ ఔషధము

పురాణ జ్వరము, పుప్పుస బలహీనతల యందు గుణకారి. అగ్నివర్ధకము, అమ్లపిత్తమును తగ్గించును.

మోతాదు : 125 మి.గ్రా. 375 మి.గ్రా. దినమునకు రెండు సార్లు చ్యవనప్రాశతో సేవించి పాలను త్రాగవలయును.

ప్యాకింగ్ : 8 T.

## మృత్యుంజయ రస (భైషజ్య రత్నావళి)

పిత్త జ్వరము తప్ప అన్ని జ్వరములయందును గుణకారి. అమదోషమును పచనముచేసి స్వేదముకలిగించి జ్వరము తగ్గించును.

మోతాదు: 1 మాత్ర చొ న దినమునకు రెండుసార్లు తేనె లేక నీటితో

ప్యాకింగ్ : 40T.

## యోగేంద్ర రస

## (సువర్ణ – మోతీయుక్త) (భైషజ్య రత్నావళి)

హృదయమునకు బలము కలిగించుటలోనూ నాడీ సంస్థానమునకు బలము కలగించి చలనము కలిగించుటలోనూ దీనికి దీటైన ఔషధము లేదు. వాత, వికృతివల్ల కలిగిన నిద్రపట్టకపోవుట. బలహీనము, హృదయ దౌర్బల్యమునందు దీనిని ఇవ్వవలయును. రెండు విధములైన రక్తభారములోను నియంత్రణ చేయును.

మోతాదు : మాత్ర 2, 3 సార్లు తేనెతో

ప్యాకింగ్ : 8T, 4 T.

## యాకూతీ (సిద్ధయోగ సంగ్రహ)

## (సువర్ణ – మోతీ–కేసర – అంబర్ యుక్త)

నాడీదౌర్బల్యము, శరీరము చల్లబడుట, స్వేదాధిక్యము. దడ, చేష్టాహాని (Collapse) తరచుగా కలుగువారు క్రమముగా కొంతకాలము

సేవించుటవలన అధికలాభము కలుగును. పుష్టికారకము, హృద్యము, మానసిక దౌర్బల్యము, నిద్ర లేకపోవుట భ్రమలయందు విశేష గుణకారి.

మోతాదు : 1 మాత్ర చొ న 2 సార్లు తేనెతో సేవించి పాలు త్రాగవలయును.

ప్యాకింగ్: 4 T.

## రస పీపరీ (ఆరోగ్య ప్రకాశ)

ఈ ఔషధము బాలుర వ్యాధులలో అత్యంత గుణకారి. అనుపాన భేదముతో బాలురకు కలుగు అనేక వ్యాధులను తగ్గించును. జలుబు, పడిశము, దగ్గు, జ్వరము, నీళ్ళ విరేచనములు, అజీర్ణము, అరుచి, వాంతులు, దంతములు వచ్చు సమయమున కలుగు ఉపద్రవములు ఈ ఔషధము సేవించుట వలన శమించును. జలుబు పడిశముల వలన పిల్లలకు శ్వాస ఆడకపోవుట, కోరింత దగ్గు, న్యూమోనియా మొదలగు భయంకర వ్యాధులు కలుగును. అటులకానీయక జలుబు ప్రారంభము నందే ఈ ఔషధము నుపయోగించిన పై ఉపద్రవములు కలుగక జలుబు తగ్గిపోయి ఆరోగ్యవంతులగుదురు. ఈ ఔషధము పిల్లలను తల్లి వలె సంరక్షించును. బీహారు ప్రాంతము నందు ఈ ఔషధము అత్యంత ప్రాముఖ్యతను ప్రచారమును పొంది యున్నది. వాస్తవము నందు బాలుర రోగముల యందు అమృతమువలె గుణకారి అయివున్నది.

మోతాదు మ జన్మకాలము నుండి 6 మాసములవరకు 15 మి. గ్రా. నుండి 30 మి. గ్రా. (1/8 టు 1/4 రత్తి) 6 నెలలు వయసు నుండి 1 సం వరకు 30 మి. గ్రా. - 65 మి. గ్రా. (1/4 టు 1/2 రత్తి) 1 సం కంటె పెద్ద పిల్లలకు బలముననుసరించి 65 మి. గ్రా. నుండి 125 మి. గ్రా. వరకు (1/2 టు 1 రత్తి) 4 గం ఒకసారి తల్లిపాలు లేక తేనెతో ఇవ్వవలయును.

ప్యాకింగ్: 20 T, 8 T.

## రసమాణిక్య రస (భైషజ్య రత్నావళి)

ఇది అన్ని విధములైన రక్తదోషములు మరియు చర్మవ్యాధులు తగ్గించుటలో ప్రసిద్ధ చెందినది. నోటియందు కలుగు పొక్కుల యందు పనిచేయును.

మోతాదు : 125 మి.గ్రా. నుండి 250 మి.గ్రా. వరకు తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 10 గ్రా. 5 గ్రా.

## రసరాజ రస

## (సువర్ణ యుక్త) (భైషజ్య రత్నావళి)

అన్ని విధములైన వాతవ్యాధులలో విశేషముగా శారీరక అంగముల అశక్తతయందు, ఆక్షేపక వాతము నందు, కర్ణనాదములందు పని చేయును. రక్తచాపము (B.P.) ను నియమితముగా నుంచును. హృదయమునకు బలము కలిగించును.

మోతాదు : 1 మాత్ర దినమునకు రెండు సార్లు తేనెతో.

ప్యాకింగ్ : 8 T, 4 T.

## రాజమృగాంక రస (సువర్ణ యుక్త)

తరుణ, పురాణకాసలు, బలహీనము, రక్తపిత్తము, శ్వాసలయందు అత్యంత గుణకారి. శారీరక మానసిక బలమును వృద్ధి చేయును.

మోతాదు : 125 మి.గ్రా. నుండి 250 మి.గ్రా. వరకు తేనెతో దినమునకు రెండు సార్లు.

## లఘుమాలినీ బసంత రస (రసతంత్ర సార)

సువర్ణ మాలనీవసంత వలెనే పనిచేయును. కాని కొద్ది తక్కువ గుణవంతముగా నుంచును.

మోతాదు: 1 నుండి 2 మాత్రలు తేనెతో దినమునకు రెండు సార్లు.

ప్యాకింగ్ : 40 T.

## లక్ష్మీ విలాస రస (నారదీయ) భైషజ్య రత్నావళి)

అన్ని కరములైన తరుణ, దీర్ఘ జ్వరములయందు, శుష్కకఫయుక్త కాసలయందు ప్రసిద్ధ ఔషధము. దీనిని సేవించుటవలన జలుబు పడిశములవల్ల కలిగిన జ్వరము, తలనొప్పి, సర్వ శరీరము నందు నొప్పులు శ్వాస అతకపోవుట మొదలగు ఉపద్రవములయందు వెంటనే పనిచేయును

మోతాదు : 1 మాత్ర చొప్పున దినమునకు రెండ మూడు సార్లు తేనెత

ప్యాకింగ్ : 40 T, 20 T.

## వాత కులాంతక రస (రసేంద్ర సార (అంబర్ యుక్త)

అపస్మారము, అపతంత్రక వాతము, పక్షవాతము, స్త్రీలలో కలుగ యోషాపస్మారము (Hysteria) మొదలగు వ్యాధుల యందు శ్రేష్ఠమైన ఔషదము.

మోతాదు : 1 మాత్ర చొప్పున తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 20 T, 8 T.

## వాత చింతామణి రస బృహత్ (భైషజ్య రత్నావళి)

వాత వ్యాధులకు సుప్రసిద్ధ ఔషధము. నిద్రానాశనము, మస్తిష్కము నందలి జ్ఞానవాహినీ నాడుల వికృతిచే కలుగు వ్యాధులయందు (స్నాయు దౌర్బల్యము) దీనిని సేవించుట వలన ప్రయోజనము కలుగును. హృదయము మస్తిష్కములకు శక్తినిచ్చును. కఠిన వాత రోగములు, సర్వ శరీరగత వేదనల యందు ప్రసిద్ధ ఔషధము

మోతాదు : 1 2 5 మి. గ్రా. నుండి 2 5 0 మి. గ్రా. వరకు దినమునక రెండు సార్లు తేనెతో.

ప్యాకింగ్ : 20 T, 8 T, 4 T.

## వాత గజాంకుశ రస

## (రసేంద్ర సార సంగ్రహ)

కఫఅనుబంధమైన వాత వ్యాధుల యందు పనిచేయును.

మోతాదు : 1,2 మాత్రలు తేనెతో దినమునకు రెండు సార్లు.

ప్యాకింగ్ : 80 T, 40 T.

## వాత విధ్వంసన్ రస

## (రసయోగ సాగర)

ఇది సన్నిపాత జ్వరము, వాత-కఫ వికృతులు జలుబువల్ల వచ్చు ఉపద్రవములు, శూల మొదలగు వానియందు పనిచేయును.

మోతాదు : 1,2 మాత్రలు తేనెతో దినమునకు రెండుసార్లు.

ఔషదము. శీతాకాలమునందు ప్రత్యేకముగా సేవించతగిన ఔషధము.

ప్యాకింగ్ : 80 T.

## శిరః శూలాది వజ్రరస (భైషజ్య రత్నావళి)

అన్ని రకములైన దీర్ఘ కాలిక, నవీనశిరశ్శూలలకు మంచి ఔషదము ఏ ఔషద సేవనచే శమించని శిరశ్శూలలు ముఖ్యముగా స్త్రీలకు ప్రతినిత్యము కలుగు శిరశ్శూల ఈ ఔషదము నియమానసారము 1,2 నెలలు సేవించిన పూర్తిగా నయమగును.

మోతాదు : 1,2 మాత్రలు తేనెతో దినమునకు రెండు సార్లు పాలతో

ప్యాకింగ్ : 40 T.

## శృంగారాభ్ర రస (భైషజ్య రత్నావళి)

శుష్క కాస (పొడిదగ్గు) కఫయుక్త కాసలయందు గుణకారి. రాజయక్షలో జనించు కాస, న్యూమోనియా యందు కలిగిన కాసలలో కూడ

శీఘ్రముగా పనిచేయును. నియమానుసారము ప్రతిదినము తప్పక సేవించవలయును.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండు మూడు సార్లు తేనె అల్లపురసములతో

ప్యాకింగ్ : 4 0T.

## శ్వాస చింతామణీ రస

## (సువర్ణ మోతీయుక్త) (భైషజ్య రత్నావళి)

దీర్ఘ కాలిక, నవీన శ్వాసరోగముల యందు గుణకారి. పిల్లలకు కలుగు కోరింత దగ్గునందు ఇచ్చెదరు. ఇది హృదయ జన్య శ్వాస (Cardiac Asthama) యందు ప్రఖ్యాతి చెందిన ఔషధము. మోతాదు : 1 మాత్ర దినమునకు రెండు మూడు సార్లు. అర్జున ఘృతము లేక తేనెతో.

ప్యాకింగ్ : 20 T, 8 T.

## శ్మృతిసాగర రస (రసయోగ సాగర)

జ్ఞాపక శక్తి వృద్ధి చేసి జ్ఞానవాహనాడులకు బలము కలిగించును.

మోతాదు : 1 మాత్ర చొప్పున దినమునకు రెండు సార్లు తేనెతో.

ప్యాకింగ్ : 8 0T.

## సువర్ణ భూపతీ రస

## (సువర్ణ యుక్త) యోగరత్నాకర)

ఆమవాతము, ఊరుస్తంభము, కంపవాతము (Tremors or paralysis agitans), కటిశూల, సంగ్రహిణీ ఉదరరోగము, అశ్మరీ మలబద్ధము విషవికారము మొదలగు వ్యాధులందు పనిచేయును.

మోతాదు : 125 మి.గ్రా. తేనెతో రోజుకు రెండు, మూడు సార్ల వరకు.

ప్యాకింగ్ : 8 T, 4 T.

# సువర్ణమాలినీ బసంత (బృహత్)

## (సువర్ణ – మోతీ– కేసర యుక్త) (రసయోగ సాగర)

జ్వరయుక్త దీర్ఘకాలికమైన కాస, శారీరక దౌర్బల్యము, జీర్ణజ్వరము మొదలగు వానిలో గుణకారి.

మోతాదు : 125 మి.గ్రా. నుండి 250 మి.గ్రా. దినమునకు రెండు సార్లు తేనెతో

ప్యాకింగ్ : 20 T, 8 T, 4 T.

# సూతశేఖరరస నెం 1

## (సువర్ణయుక్త) (సిద్ధయోగ సంగ్రహ)

అమ్లపిత్త వ్యాధి నివారణలో సుప్రసిద్ధ ఔషధము. వమనము, హిక్కా, గళదాహము, భమ, అగ్నిమాంధ్యములందు గుణకారి. ఉదావర్తము, అతిసారము, ఉదరశూలలయందు పనిచేయును. రోగానుసారము అనుపానములతో అనేక రోగములను తగ్గించును.

మోతాదు : 125 మి.గ్రా. నుండి 250 మి.గ్రా. వరకు తేనె, పాలు ఆమలక మురబ్బా అనుపాలముతో ఆవశ్యకతానుసారం ఇవ్వవలెను.

ప్యాకింగ్ : 8 T, 4 T.

# సూత శేఖర రస (సిద్ధయోగ సంగ్రహ) (సువర్ణరహిత)

సూతశేకర రస నెం 1 కన్న తక్కువ గుణకారి. అమ్లపిత్త రోగులు క్రమముగా సేవించవచ్చును.

మోతాదు : 125 మి.గ్రా. నుండి 250 మి.గ్రా. వరకు భోజనానంతరము తేనెతో

మోతాదు : 1, 2 మాత్రలు రోజుకు రెండు సార్లు మూడు సార్లు దశ మూల క్వాథముతో

ప్యాకింగ్ : 40 T, 20 T.

# సూతికాభరణ రస

## (సువర్ణయుక్త) (యోగరత్నాకర)

ఇది బంగారము కలిసిన యోగమగుటచే సూతికా వినోద రసము కన్న అధిక గూణవంతమయినది. సూతికలకు ధనుర్వాతమునందు A.T.S. ఇంజెక్షను ఇచ్చిన తరువాత దీనిని ఉపయోగించుట మంచిది.

మోతాదు : 30 మి.గ్రా. రోజుకు రెండుసార్లు తేనెతో.

ప్యాకింగ్ : 4 T.

# సోమనాథరస బృహత్ (సువర్ణయుక్త)

స్త్రీల వ్యాధులలో విశేష గుణకారి.

మోతాదు : 1 మాత్ర చొ న దినమునకు రెండు సార్లు తేనెతో

ప్యాకింగ్ : 8 T.

# హృదయార్ణవ రస (భైషజ్య రత్నావళి)

హృద్రోగములను తగ్గించి హృదయముకు శక్తి నిచ్చును.

మోతాదు : 1 మాత్ర చొ న దినమునకు రెండు సార్లు తేనెతో

ప్యాకింగ్ : 80 T, 40 T, 20 T.

# హేమగర్భ పొట్టలి (స్వర్ణ యుక్త)

## (భైషజ్య రత్నావళి)

దీని సేవనవలుచే రాజయక్ష్మ (Thysis) సంగ్రహణి హృదయరోగములు శ్వాస కాస లాంటి కటిన రోగములను బాగుచేయును. ఇది అత్యంత శక్తివర్ధకమైన ఔషధము.

మోతాదు : 31 నుండి 125 మి.గ్రా వరకు తేనెతో

ప్యాకింగ్ : 4 T.

## + A కామిని విద్రావణ్ రస (భై.ర)

బల, వీర్య, శక్తివర్ధకవము, పురుషులకు స్త్రీలకు కూడా ఉపయోగకరము.

మోతాదు : 1 - 2 మాత్రలు సంభోగమునకు 2 గం ల ముందు గోరువెచ్చని పాలతో తీసుకొనవలెను.

ప్యాకింగ్ : 10 గ్రా. 5 గ్రా.

## చంద్రకళ రస

దీని సేవనముచే ప్రమేహ, శ్వేతప్రదరము, మల మూత్రవిసర్జనములతో అగు వీర్యస్ఖలనములు, స్వప్నదోషములు ఇలాంటి రోగములను పోగొట్టు గుణము కలది.

వాడు విధానము : ఒక్కొక్క మాత్ర ఉ॥ సా॥ గిలోయ లేదా తేనెతో

ప్యాకింగ్ : 40 T.

## బైద్యనాథ్

## లోహ – మండూర

శరీరములో రక్తము ప్రత్యేక ప్రాముఖ్యతను కలిగియున్నది. రక్తము తగ్గుట వలన అనేక రోగములు కలుగును. లోహము, మండూరము ఇచ్చుట వలన అగ్నివృద్ధి కలిగి, రక్తవృద్ధి జరుగును. శరీరము కొత్త రక్తము యొక్క సంచారము జరుగును. ఈ ఔషధములు అనేక రూపములలో రోగులకు ఇవ్వబడును. అమృత తుల్యమైన ఈ ఔషధములను మొదటగా అందించినది ఆయుర్వేదమే. మండూరము, లోహము కన్న సౌమ్యముగా పనిచేయును.

## అమ్లపిత్తాంక లోహ

పిత్త వికారములలో మంచి గుణకారిని

మోతాదు : 250 మి.గ్రా. నుండి 500 మి.గ్రా.

ప్యాకింగ్ : 40 T.

# తాప్యాదిలోహ నెం 1

## (అష్టాంగ హృదయ)

పాండు, రక్తాల్పత, మలావరోధము, శోధ, కృమిరోగము, శారీరక దౌర్బల్యమునందు గుణకారి ఇది. ఉత్తమమైన రక్తవర్థకము, బలవర్ధకము, రాజయక్ష్మరోగులు నియమపూర్వకంగా దీనిని సేవించవలయును.

మోతాదు: 200 మి.గ్రా. నుండి 500 మి.గ్రా వరకు దినమునకు రెండు సార్లు తేనెతో.

ప్యాకింగ్: 20 T.

# ధాత్రీ లోహ (భైషజ్య రత్నావళి)

అమ్లపిత్తము, అజీర్ణము మలబద్ధముల యందు గుణకారి.

మోతాదు : 250 మి.గ్రా. నుండి 375 మి.గ్రా. వరకు తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 40 T.

# నవ్యాస లోహ (భైషజ్య రత్నావళి)

రక్తాల్పత Anaemia) యకృత్ వికారములు, కామల హాలీమకము అగ్నిమాంద్యము మందజ్వరము దౌర్బల్యము మొదలగు వ్యాలయందు ప్రసిద్ధ ఔషధము.

మోతాదు: 250 మి.గ్రా. నుండి 500 మి.గ్రా. వరకు దినమునకు రెండుసార్లు తేనెతో

ప్యాకింగ్: 40 T.

# ప్రదరాంతక లోహ

## (రసేంద్ర సారసంగ్రహ)

ఇది స్త్రీల వ్యాధులయందు పనిచేయును. ప్రదర వ్యాధులు రాజయక్ష్మలలో ఇచ్చెదరు.

మోతాదు : 200 మ.గ్రా. నుండి 500 మి.గ్రా. వరకు దినమునకు రెండ సార్లు తేనెతో

ప్యాకింగ్ : 40 T, 20 T.

## పునర్నవాది మండూర (భైషజ్య రత్నావళి)

శోధ వ్యాధియందు అత్యంత గుణకారి

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండు సార్లు త్రిఫలా క్వాధముతో ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 40 T.

## మేదోహర విడంగాదిలోహ

## (భైషజ్య రత్నావళి)

శరీర స్థౌల్యమును, మేదో ధాతువును తగ్గించును.

మోతాదు : 50 మి.గ్రా. నుండి 1 గ్రాము వరకు దినమునకు రెండు సార్లు వేడినీళ్ళతో.

ప్యాకింగ్ : 40 T.

## యకృత్ ప్లీహారిలోహ

## (భైశజ్య రత్నావళి)

యకృత్ మరియు ప్లీహ రోగములయం పనిచేయును.

మోతాదు : 1 మాత్ర దినమునకు రెండుసార్లు నీళ్ళతో

ప్యాకింగ్ : 40 T.

## విషమజ్వరాంతక లోహ పుటపక్వ

## (సువర్ణమోతీ యుక్త) (భైషజ్య రత్నావళి)

చిరకాలము నుండి బాధించుచున్న మలేరియా, ఔషధములతో శమించని మలేరియా జ్వరము ఈ ఔషధ ముపయోగించుటచే శమించును.



లాజ్వర్, జీర్ణజ్వరవము మరియు అన్ని విధవములైన
దు కూడ పనిచేయును.
ం : 60 మి.గ్రా. నుండి 125 మి.గ్రా. వరకు రెండు సార్లు

ï : 8T, 4T.

## శోథారి లోహ

### (భైషజ్య రత్నావళి)

క్షీణించుట, రక్తములో లోహము తగ్గి శోధ కలుగుట
ముదలగు వానియందు పనిచేయును. దీపనము, పాచనము
క్తవృద్ధి చేయును.
ప : 1,2 మాత్రలు దినమునకు రెండు సార్లు పాలతో
ï : 40 T.

## థారి మండూర (భైషజ్య రత్నావళి)

ముునందు అధికగుణకారి. పైలోహముకన్న సౌమ్యముగా

ప : 1,2 మాత్రలు దినమునకు 2,3 సార్లు పునర్న వారిష్ట

ï : 40 T.

## సప్తామృత లోహ

### (భైషజ్య రత్నావళి)

లకు హితమైనది. దృష్టి మాంద్యము పోగొట్టును.
ప: 1,2 మాత్రలు దినమునకు రెండు సార్లు పునర్నవాది

ï : 40 T, 20 T.

## సర్వజ్వరహర లోహ బృహత్

పురాతన కాగా జ్వరములందు ఉత్తమ గుణాకారిని

మోతాదు : 100 మి.గ్రా. 150 మి.గ్రా పాలతో

ప్యాకింగ్ : 4 T.

# బైద్యనాథ్

## బటీ – మాత్రలు

మాత్రలు బహుసులభముగా సేవించవచ్చును. గట్టిగా యున్న యెడల చిన్న ముక్కలుగా చేసి వాడవలయును. చప్పరించి సేవించు మందులు ఏ విధమయిన అనుపానము లేకనే వాడవచ్చును.

## అగ్నితుండి బటీ (భైషజ్య రత్నావళి)

ఉదరగత వాయువును శీఘ్రముగా శమింపచేసి సుఖము నిచ్చును. దీపనవము, పాచనవము విషముష్టిగింజలు కలిసిన ఔషధమగుటచే బలవర్ధకముగానూ అంత్రముల మాంసపేశీలకు బలము కలిగించును.

మోతాదు 1,2 మాత్రలు దినమునకు రెండు సార్లు వేడినీటితో

ప్యాకింగ్ : 80 T.

## అర్శోఘ్ని బటీ (సిద్ధయోగ సంగ్రహము)

ఇది అర్శస్సు, రక్తార్శస్సులందు పనిచేయు ఔషధము.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండుసార్లు జలముతో.

ప్యాకింగ్ : 40 T.

## ఏలాది బటీ (చరక సంహిత)

దీర్ఘకాలానుబంధితమై శుష్కకాస, తృష్ణ, రక్తపిత్తము, దడ మొదలగు వ్యాధులందు పనిచేయును.

మోతాదు : 2 నుండి 6 మాత్రల వరకు చప్పరించవలయును.

ప్యాకింగ్ : 20 T.

## కర్పూరాది బటి (అనుభూతము)

ముఖపాకము, ముఖ దుర్గంధము చిగుళ్ళ నుండి రక్తం కారుట, చిగుళ్ళవాపు, మొదలగు ముఖరోగములందు పనిచేయును.

మోతాదు : 1, 2 మాత్రలు చప్పరించవలయును.

ప్యాకింగ్ : 40 T

## కాంకాయనబటి గుల్మ (భైషజ్య రత్నావళి)

అన్ని విధములైన గుల్మ రోగములందు అత్యంత గుణకారి

మోతాదు : 1 నుండి 2 మాత్రలు వేడినీటితో దినమునకు రెండు మూడు సార్లు.

ప్యాకింగ్ : 40 T

## కాంకాయన బటి (అర్శ) (యోగచింతామణి)

ఇది అర్శోవ్యాధియందు అత్యుత్తమముగా పనిచేయును రక్తార్శస్సునందు కూడ పనిచేయును.

మోతాదు : 2, 3 మాత్రలు మజ్జిగతో దినము రెండు మూడు సార్లు (అవసరమునుబట్టి) ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 40 T

## కుటజఘనబటి (సిద్ధయోగ సంగ్రహము)

జ్వరముతో కూడి ఆమాతిసారము సంగ్రహణి మరియు రక్తాతిసారములందు గుణకారి. అమెబిక్ డీసెంటరీలో (Amoebic dysentry) అత్యుత్తమముగా పనిచేయును.

మోతాదు : 2, 3 సార్లు జలముతో

ప్యాకింగ్ : 40 T

## ఖదిరాది బటి (యోగరత్నాకరము)

ఇది స్వరబేదము, కాస మరియు ముఖపాకములందు పనిచేయుము.

మోతాదు : 1, 2 మాత్రలు చప్పరించవలయును.

ప్యాకింగ్ : 40 T

## చందనాది బటి (సిద్ధయోగ సంగ్రహము)

ఇది మూత్రమార్గమునందు జనించు వ్రణము మాన్పి మూత్రము జనించునపుడు కల్గు మంటను తగ్గించును. మూత్రము జారీ చేయును.

మొతాదు : 1, 2 మాత్రలు దినమునకు రెండు మూడు సార్లు నీళ్ళతో ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 40 T

## చంద్ర ప్రభాబటి (సిద్ధయోగ సంగ్రహము)

లోహము, శిలాజిత్తు, గుగ్గలు ప్రధాన ద్రవ్యములుగాగల ఈ ఔషదము మూత్రాశయము మరియు శుక్రదోషములను పోగొట్టుటలో ప్రసిద్ధ ఔషధము. ఇది బలమును కల్గించును. శరీరము యొక్క బహు మూత్రమును, శ్వేతప్రదరముమూత్రకృచ్ఛ్రము, అశ్మరీ మరియు స్త్రీ పురుష జననేంద్రియ వ్యాధులందు అత్యుత్తమముగా పనిచేయును. మూత్రము నందు వెడలు అల్బుమినీ పాస్పేటులను తగ్గించును. మూత్రదాహము, మధుమేహము లందు కూడ పనిచేయును.

మోతాదు : 1, 2 మాత్రలు ఉదయము సాయంత్రము పాలతో

ప్యాకింగ్ : 80 T, 40 T, 20 T.

## చిత్రకాది బటి (భైషజ్య రత్నావళి)

ఆమాశయము వికృతి చెందినందువలన ఆహారము సరిగా జీర్ణము కాదు. సేవించిన ఆహారము సరిగా జీర్ణముగానందున మలము

అమయుక్తముగా అపక్వముగా వెడలును సంగ్రహణి రోగము కలుగును. ఈ పరిస్థితియందు ఈ ఔషధము వలన మంచి గుణము కలుగును. ఆహారము సరిగా జీర్ణమంగునం. అవరాతిసారవము, ప్రవాహిక, సంగ్రహణి, అగ్నిమాంద్యములందు అత్యంత గుణకారి.

మోతాదు : 1 నుండి 3 మాత్రలు భోజనమునకు ముందు, ఆల్లపురసము లేక నీటితో

ప్యాకింగ్ : 80 T, 40 T.

## + A జాతీఫలాది బటి (స్తంభక)

పేరుకు తగిన ఔషధము శుక్రస్తంభకము వైద్యసలహానుసరించి అవశ్యకతానుసారము తగు మోతాదుతో వాడ వలయును.

ప్యాకింగ్ : 20 T.

## ప్రభాకర బటి (భైషజ్య రత్నావళి)

హృదయమునకు హితకరము, మానసిక దౌర్బల్యము రక్తహీనత మరియు వాత వహనాడుల వికృతిని పోగొట్టును.

మోతాదు : 1, 2 మాత్రలు అర్జున పట్ట చూర్ణము పాలలో కలిపి మరిగించి ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 20 T.

## బ్రాహ్మీ బటి

## (సువర్ణము, ముత్యము, కుంకుమపూవు కలసినది)

ఇది టైఫాయిడ్‌లలో కలుగు ఉద్రవములలో ఉపయోగించదగినది, రక్తదోషమును పోగొట్టును. టైఫాయిడ్ జ్వరమునందు అల్లోపతి ఔషధములు వాడుచున్నప్పుడు ఆ ఔషధముల దుర్గుణమును తగ్గించుటకై దీనిని కూడ వాడిన చాలా మంచిది.

సన్నిపాత జ్వరమునందు వాతప్రకోపము వలన మరియు అధిక

జ్వరము వలన వచ్చు ఉపద్రవములైన నిద్రలేమి బలహీనత మొదలగు లక్షణములలో శీఘ్ర ఉపశమనకారి.

ముఖ్యముగా బుద్ధిమాంద్యమును పోగొట్టి మానసిక శక్తిని పెంచుటలో దీని కిదే సాటి.

మోతాదు : 1/2 నుండి 1 మాత్ర వరకు దినమునకు మూడు సార్ల వరకు జలముతో

ప్యాకింగ్ : 8 T, 4T.

## బ్రాహ్మీబటి

## (అయుర్వేద సారసంగ్రహ) (బుద్ధివర్ధక్)

జ్ఞాపక శక్తిని పెంపొందించి బుద్ధి వికాసమును కలుగచేయును.

మోతాదు : 2 మాత్రలు చొ దినమునకు రెండుసార్లు పాలతో

ప్యాకింగ్ : 20 T.

## మకరధ్వజ బటి (భైషజ్య రత్నావళి)

ఈ ఔషధము బల, వీర్య, కాంతులను మరియు స్ఫూర్తిని కలుగచేయు అత్యంత మేలైన వాజీకరణ ఔషధము

వీర్యవృద్ధికరము, వీర్యస్థంబకము, శక్తివర్ధకము, పుష్టీకరము.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండుసార్లు మీగడ పాలతో

ప్యాకింగ్ : 5 గ్రా, 2.5 గ్రా.

## మరీచ్యాది బటి (శా.సం)

శుష్కకాస మరియు గొంతు బాధలయందు అత్యంత గుణకారి.

మోతాదు: 1,2 మాత్రలు అవసరమును బట్టి చప్పరించ వలయును.

ప్యాకింగ్ : '0 T.

## మహాశంఖ బటి (భైషజ్య రత్నావళి)

అజీర్ణము మరియు వాతజనిత ఉదరశూల, పరిణామ శూలల

యందు అత్యంత గుణకర ఔషధము. దీనిని సేవించుట వలన అజీర్ణము తగ్గి ఆహారము సరిగా జీర్ణమగును. అగ్ని మాంద్యమునందు జఠరాగ్నిని వృద్ధి చేసి ఆకలి పుట్టించును. అధిక భోజనము, అధిక గురుపదార్థసేవన వలన కలుగు అధ్యానమును తగ్గించును.

మోతాదు : 1,2 మాత్రలు వేడినీటితో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 40 T.

## రజఃప్రవర్తనీ బటి (ఆయుర్వేద సారసంగ్రహ)

స్త్రీలకు మాసిక ధర్మము ఆగిపోవుట వలన కటిశూల, ఉదరశూల హస్తపాదములు మరియు నేత్రముల మంట కలుగును. ఈ ఔషధము సేవించుట వలన ఋతుస్రావము సరిగా జరిగి పైన చెప్పబడిన ఉపద్రవములు నివారించును.

మోతాదు : 1,2 మాత్రలు ఉదయము సాయంత్రము వేడి నీటితో ఋతుస్రావము మామూలుగా అగువరకు వాడవలెను.

ప్యాకింగ్ : 20 T.

## రాజ బటి (గంధకబటి) యోగచింతామణి

ఉదరవాయువు (Gas) అజీర్ణము మరియు రక్తదోషములయందు వాడదగినది.

మోతాదు : 2,3 మాత్రలు వేడినీటితో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 60 T.

## లవంగాది బటి (వైద్యజీవనము)

అన్ని రకముల కాసల యందు ప్రఖ్యాతి గాంచినది.

1,2 మాత్రలు నోటితో చప్పరిచి రసమును మింగుచున్నచో గొంతు గురుగుర స్వరభేదము, దగ్గు తగ్గును.

ప్యాకింగ్ : 40 T.

# లశునాది బటి (వైద్య జీవనము)

విశూచిక, అజీర్ణము మొదలగు ఉదర రోగములలో వాడతగినది.

అగ్నిమాంద్యము, ఉదరశూల, ఉదరవాతము, పులి త్రేన్పులు, వమనము తగ్గించి అపానవాయువును వెడలించి సుఖమును కలుగచేయును. విశూచి ప్రారంభదశలో వెంటనే గుణకారి. కలరా ఉన్న ప్రాంతాలలోని వారు దీనిని సేవించుచున్నచో వ్యాధి సోకకుండా కాపాడును.

మోతాదు : 1 నుండి 3 మాత్రలవరకు భోజనానంతరము నిమ్మరసము నీరు మజ్జిగతో.

ప్యాకింగ్ : 20 T.

# వృద్ధివాదిక బటి (భావప్రకాశిక)

అన్ని రకముల అండవృద్ధి, మరియు అంత్రవృద్ధులయందు గుణకారి.

మోతాదు : 1, 2 మాత్రలు దినమునకు రెండు మూడు సార్లు వేడినీళ్ళు లేక పాలతో

ప్యాకింగ్ : 20 T

# వ్యోషాది వటిః (శా.సం)

జలుబు, పడిశము, కాస స్వరభంగములయందు వాడదగినది.

మోతాదు : 1, 2 మాత్రలు దినమునకు రెండు మూడు సార్లు.

ప్యాకింగ్ : 40 T.

# శంఖ బటి (భైషజ్య రత్నావళి)

అజీర్ణము, అగ్నిమాంద్యము, ఉదరశూలలయందు దీనిని సేవించిన మంచి గుణము కలుగును.

మోతాదు : 1, 2 మాత్రలు వేడినీళ్ళతో

ప్యాకింగ్ : 20 T.

## ?త్యాది బటి (భైషజ్య రత్నావళి)
## (సువరయుక్తము)

?షములను పోగొట్టి శరీరమునకు బలము కలిగించి ?ము మరియు జ్ఞాపకశక్తిని పెంచు ఔషధము.

1 మాత్ర దినమునకు రెండుసార్లు.

8 T, 4 T.

## ?లాజిత్యాది బటి (సాధారణ)

?కన్న కొంచెము తక్కువ గుణకారి.

1 మాత్ర పాలతో దినమునకు రెండుసార్లు.

20 T.

## మాతృకా బటి (భైషజ్య రత్నావళి)

?వము అశ్మరీ మొదలగు వ్యాధులను తగ్గించును. ?క్తమును వృద్ధి చేయును. శుక్రగంధులకు, బలము కలుగ

: 1, 2 మాత్రలు పాలతో దినమునకు రెండుసార్లు

40 T.

## ?లవర్ధినీ బటి (భైషజ్య రత్నావళి)

?ధులయందు ప్రఖ్యాతి గాంచిన ఔషధము 8 విధములైన ?ందు పనిచేయును. ప్లీహారోగము, గుల్మము, అగ్ని మాంద్యం ?ర వ్యాధుల యందు అత్యుత్తమముగా పని చేయును. ?మల, పాండు మరియు శోధ వ్యాధుల యందు కూడ

మోతాదు : 1,2 మాత్రలు ఉదయం సాయంత్రం వేడినీళ్ళతో.

ప్యాకింగ్ : 40 T.

## సంజీవని బటి (శా.సం.)

అజీర్ణము, మరియు విసూచికా (కలరా) ప్రారంభ సమయమున అత్యుత్తమముగా పనిచేయును. గుల్మము, సన్నిపాతజ్వరము, ఆటోపము (Gas) ఉదరశూల, అతి సారముల యందు పనిచేయును.

మోతాదు: 1 నుండి 4 మాత్రలు వరకు అల్లపు రసముతో లేక నీళ్ళతో

ప్యాకింగ్ : 80 T, 40 T.

## సంశమనీ బటి (సి.యో.సం)

పిత్తవికారములు, అమ్లపిత్త, జ్వరము, జ్వరానంతర దౌర్బల్యముల యందు హృదయ దౌర్బల్యము నంగు గుణకారి.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండు, మూడు సార్లు నీళ్ళతో.

ప్యాకింగ్ : 20 T.

## సారివాది బటి (భైషజ్య రత్నావళి)

చెవిలో చీము కారుట, నొప్పి, సరిగా వినపడకపోవుట మొదలగు కర్ణ వ్యాధుల యందు పని చేయును.

మోతాదు : 1,2 మాత్రలు నీళ్ళతో.

ప్యాకింగ్ : 20 T.

## + B సర్పగంధ ఘన బటి (సి.యో.సం.)

దీనిని సేవించుటవలన నిద్ర బాగుగా వచ్చును. మానసిక వికారములు రక్త భారాధిక్యత (High Blood Pressure) ల యందు అత్యుత్తమ నిరపాయకరమైన ఔషధము.

మోతాదు : 2,3 మాత్రలు గులాభీ అర్కము లేక పాలతో

# బైద్యనాథ్
# పర్పటి

**గుణములు :** రసాయన కల్పచికిత్సయందు పర్పటీ విశిష్ట స్థానము నాక్రమించియున్నది. శుద్ధిచేయబడిన పాదరసము, గంధకములతో తయారు చేయబడిన పర్పటీ సేవన వల్లనే పూర్తి గుణము కనిపించును. అష్ట సంస్కారములు చేయబడిన పాదరసముతో తయారు చేయబడిన పర్పటి అత్యంత విశ్వసనీయముగా ప్రతిభా వంతముగా పనిచేయును. పర్పటీ మహాస్రోతస్సు నందలి పిత్తదరా కలను (గ్రహణి) సక్రమముగా నుంచి పాచక రసముల ఉత్పత్తిని పెంచును. ఆ రస ధాతువు శోషమ సక్రమముగా జరుగునట్లు చేయును.

సగ్రహణీ వ్యాధియందు సేవించిన ఆహారము సరిగా పచనము గాక రస శోషణ జరుగక ఆహారము మలముతో వెడలిపోవును. మలము దూషితమగును, రోగి దుర్బలుడగును. సామాన్యముగా పర్టీ ఆహారముతో ఇచ్చెదరు. విశిష్టగుణమునకై పర్పటీ 100 మి. గ్రా. మోతాదులు ప్రారంభించి ప్రతిదినము 100 మి. గ్రా. చొ న ఔషధమాత్ర పెంచుచూ 1 గ్రాము వరకు పెంచవలెను. అచటి నుండి మరల మోతాదు తగ్గించుచూ ఇవ్వవలయును. ఈ విధముగా ఇచ్చుటను పర్పటీకల్పము లేక వర్ధమాన యోగము అందురు ఈ పద్ధతిలో ఔషధం సేవించునప్పుడు మామూలుగా తీసుకొను ఆహారము మానివేసి సాత్వికమైన పాలు, మజ్జిగ, మరియు పండ్లను సేవించవలయును. ఈ ఔషధ కల్పము వలన రోగికి కాయ కల్పము జరిగి పునః యవ్వనము వచ్చును.

## పంచామృత పర్పటి (భైషజ్య రత్నావళి)

సంగ్రహణి వ్యాధియందు ప్రసిద్ధి ఔషధము, అతిసారము, పాండు, అరుచి, అగ్నిమాంద్యము, ప్రవాహిక, శూల, అమ్లపిత్తము యందు గుణకారి.

మోతాదు : 100 మి.గ్రా. నుండి 400 మి.గ్రా. వరకు 2 మోతాదులుగా తేనె పొంగించిన జీలకర్ర చూర్ణములో ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 10 గ్రా.

# విజయ పర్పటి (భైశజ్య రత్నావళి)
# (సువర్ణ – మోతీయుక్తము)

కష్టసాధ్యమైన సంగ్రహణీ, అతిసారము, పాండు, జలోదరము శోధ, పరిణామశూల, అమ్లపిత్తము మొదలగు వానియందు ఉత్తమ ఔషధము. సంగ్రహణీ వ్యాధిలో అగ్నిమాంద్యము కలవారికి ఈ ఔషధమిచ్చుట మంచిది.

మోతాదు : 125 మి.గ్రా. 250 మి.గ్రా. వరకు వేయించిన జీలకఱ్ఱ చూర్ణముతో మరియు తేనెతో మోతాదులుగా విభజించి ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 1 గ్రా.

# రసపర్పటి (భైషజ్య రత్నావళి)

పాచకము, దీపనము, కృమిఘ్నము, శోధకము, అగ్నిమాంద్యము సంగ్రహణి, రక్తాల్పత, అజీర్ణము, అమ్లపిత్తము మొదలగు వ్యాధుల యందు గుణకారి.

మోతాదు : 100 మి.గ్రా. 400 మి.గ్రా వరకు వేయించిన జీలకఱ్ఱ చూర్ణము, తేనెతో

ప్యాకింగ్ : గ్రా.

# లోహ పర్పటి (భైషజ్య రత్నావళి)

అమ్లపిత్తము, అగ్నిమాంద్యము పాండు యకృత్ రోగములు మరియు సంగ్రహణీ మొదలగు వ్యాధుల యందు విశేష గుణకారి. రక్తవృద్ధి చేయును. సంగ్రహణి యందు రక్తక్షయము కలిగి హిమోగ్లోబిన్ 7 గ్రా వరకు ఉన్నప్పుడు దీనిని ఇవ్వవలయును.

మోతాదు : 100 మి.గ్రా. 400 మి.గ్రా. వరకు వేయించిన జీలకర్ర చూర్ణము మరియు తేనెతో.

# శ్వేతపర్పటీ

మూత్రల ఔషధము, మూత్రకృచ్ఛ్రము, కలరా వ్యాధులయందు మూత్రము రానపుడు దీనిని ఇచ్చిన జారీ చేయును.

మోతాదు : 100 మి.గ్రా. 200 మి.గ్రా. నీటితో

ప్యాకింగ్ : 10 గ్రా.

# స్వర్ణపర్పటీ (భై.ర.)

సువర్ణము కలిపిన యోగము. అందువలన శక్తివర్ధకము, రస, రక్తాదిధాతు వర్ధకంగా యోగవాహిగా, కృమిఘ్నము మరియు త్రిదోష హరముగా పనిచేయును.

హృదయమునకు శక్తి నిచ్చును. అంత్రక్షయకారణముగా ఏ ఔషధ సేవనకు తగ్గని విరేచనములు, మిగిలిన పర్పటీ ఔషధములు పనిచేయునపుడు ఈ ఔషధం కల్పముగా ఇచ్చిన అత్యుత్తమముగా శీఘ్రముగా పనిచేయును. ఈ ఔషధ సేవన కాలమందు రోగికి సరిపడిన పాలను ఇచ్చుట మంచిది. లేనిచో మజ్జిగను ఇవ్వవలయును. రోగి త్రాగగలిగినంత దానిమ్మ రసమును ఇచ్చుట మంచిది. అష్ట సంస్కారిత పాదరసముతో తయారు చేయబడిన స్వర్ణపర్పటీనే వాడవలయును.

బైద్యనాథ్ ఔషధ నిర్మాణశాలయందు పాదరస అష్టసంస్కారములు చేయు నిమిత్తము ప్రత్యేకమైన ఏర్పాటు కలదు. దతియా నగర మందు అనేక వేల రూపాయల వ్యయంతో శర్మా ఆయుర్వేద మందిరమునందు పాదరస అష్ట సంస్కారములపై జరిపిన పరిశోధనల అసారముతో అష్ట సంస్కారములు చేయించబడును.

మోతాదు : 125 మి.గ్రా. 250 మి.గ్రా. వరకు తేనెతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్ : 1 గ్రా.

# గుగ్గులు

చికిత్సలో గుగ్గులు కలిసిన ఔషదములకు ప్రాముఖ్యత కలదు. మా ఫార్మశీలో ఉత్తమ గుగ్గిలము తీసుకొని శాస్త్రములు చెప్పబడిన ప్రకారము శుద్ధిచేసి ఔషదములలో చేర్చెదము. గుగ్గిలు ఔషదములు మాత్రలను పొడిచేసి వాడుట మంచిది.

## కాంచనార గుగ్గులు (మో.ర.)

అన్ని రకములైన గండమాల వ్యాధుల అపచి, లసీకా గ్రంధుల శోధ (Lymphadenitis) ల యందు పనిచేయును

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండు సార్లు పాలతో.

ప్యాకింగ్ : 20 గ్రా.

## కైశోర గుగ్గు (శా.సం)

వాతరక్తము, రక్తదోషము వల్ల చర్మముపై వచ్చు మచ్చలు, వ్రణములు, దద్దులు, కుష్టము, ప్రమేహ పిడిక, పాండు దాహము, గుల్మము, శోధ, మరియు నేత్ర వ్యాధుల యందు కైశోర గగ్గులు సేవించుటవలన గుణము కలుగును. భగందరమునందు కూడా పనిచేయును.

మోతాదు : 1, 2 మాత్రలు దినమునకు రెండు సార్లు పాలతో.

ప్యాకింగ్ : 80 T

## గోక్షురాది గుగ్గులు (శాం.నం.)

అశ్మరీ మొదలగు వ్యాధుల యందు గుణకారి. వృక్కశోధ, (Nephritis) మూత్రములో అల్బుమిన్ (Albumin) వెడలునపుడు రక్తమునందు యూరియా ప్రమాణము పెరిగినపుడు నియమానుసారము క్రమముగా 1,2 నెలలు ఈ ఔషదము సేవించిన గుణము నిచ్చును.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండు సార్లు పాలతో.

ప్యాకింగ్ : 80 T

## త్రయోదశాంగ గుగ్గులు ( భా. ప్ర.)

వాతజశూల, ఆమవాతము, గృధ్రశ్రీ వాతముల యందు గుణకారి.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండు మూడు సార్లు పాలతో

ప్యాకింగ్ : 80 T

## త్రిఫలా గుగ్గు (శాం.సం.)

భగందరము, గుల్మము, శోధ, మలబద్ధములయందు పనిచేయును.

మోతాదు: 1,2 మాత్రలు దినమునకు రెండు సార్లు పాలు లేక జలముతో

ప్యాకింగ్ : 80 T

## పునర్నవాది గుగ్గులు ( భైషజ్య రత్నావళి)

దీనిని సేవించుటచే అనువాతవము, గృధ్రసీవాతవము, శోధలు, శమించును.

మోతాదు : 1,2 మాత్రలు దినమునకు రెండు మూడు సార్లు త్రిఫలాక్వాధముతో.

ప్యాకింగ్ : 80 T

## రాస్నాది గుగ్గు (యో. ర.)

ఆమవాతము, సంధివాతము, ( కీళ్ళ నొప్పులు) గృధ్రసీవాతము, శిరోవ్యాధుల యందు, నాడీ వ్రణము (నారి కురుపు) నందు గుణకారి.

మోతాదు : 1,2 మాత్రలు పాలు లేక మహ రాస్నాది క్వాధముతో దినమునకు 2,3 సార్లు.

ప్యాకింగ్ : 80 T

## లక్షాది గుగ్గులు (భైషజ్య రత్నావళి)

విరిగిన ఎముకలు అతుకుటకు ఉత్తమ ఔషధము

మోతాదు : 1,2 మాత్రలు దినముకు 2,3 సార్లు పాలతో.

ప్యాకింగ్ : 80 T

# సప్తవింశతి గుగ్గులు

## (భైషజ్య రత్నావళి)

భగందరము, అర్శస్సు, దీర్ఘకాలిక వ్రణములు, హృదయశూల, వస్తిశూలల యందు మరియు ఆంత్రవృద్ధియందు అత్యంత గుణకారి.

మోతాదు : 1, 2 మాత్రలు దినమునకు రెండుసార్లు నీటితో.

ప్యాకింగ్ : 80 T

# సంహనాద గుగ్గులు

## (భైషజ్య రత్నావళి)

ఆమవాతము, ఉదరరోగము, గుల్మముల యందు గుణకారి.

మోతాదు : 1, 2 మాత్రలు దినమునకు 2 సార్లు నీటితో

ప్యాకింగ్ : 80 T

# యోగరాజ గుగ్గులు

## (భైషజ్య రత్నావళి)

అనువాతవము, సంధి వాతవము (కీళ్ళనొప్పులు) వాత రక్తము, భగందరము, అరుచి, కాస, శ్వాస ధాతుక్షీణత, బహు మూత్రము, ప్రమేహము, అర్శ శిరోరోగముల యందు గుణమిచ్చుటలో ప్రసిద్ధ ఔషధము. మలబద్ధము, స్త్రీల ప్రసవ రోగవముల యందు ఉత్తమముగా పనిచేయును. వాత వాహినులయందు సంచితమైన విషమును నిర్మూలించుటలో యోగరాజ గుగ్గు అత్యంత ప్రభావశాలి. వృద్ధులకు ఉత్తమ మిత్రుడు ఉదర వాతమునందు (gas) గుణకారి. వాతహర గుణము కలిగియుండి వాత వాహనాములకు బలవము నిచ్చును. స్త్రీల గర్భాశయుముపై గుగ్గలు పనిచేయుటచే ఋతుదోశములను సరిచేయును. 80 రకముల వాత వ్యాధులకు ప్రసిద్ధి ఔషధము.

మోతాదు : 1, 2 మాత్రలు ఉదయము, సాయంత్రము మహారాస్నాది క్వాథము దసమూల క్వాథము లేక పాలతో.

ప్యాకింగ్ : 30 గ్రా, 15 గ్రా.

# మహా యోగరాజ గుగ్గులు

యోగరాజ గుగ్గులు కంటే అధిక గుణకారి, వాతరక్త, వాతవ్యాధులలో, ఆమవాతములో అత్యంత గుణకారి.

మోతాదు : 1,2 మాత్రలు ఉదయం, సాయంత్రం మహారాస్నాది కాడా, దశమూల క్వాథము లేక పాలతో.

ప్యాకింగ్ : 40 T, 20 T.

# స్వర్ణ మహా యోగరాజ గుగ్గులు

మహా యోగరాజ గుగ్గులు యందు స్వర్ణము, సురంజాన్ మొదలగు వాతహర, శక్తివర్ధక, స్నాయు మండలమునకు శక్తి నిచ్చు ద్రవ్యములు కలిపి తయారుచేయబడినది. అందువలన ఇది అన్ని వాతవ్యాధుల యందు స్నాయు దౌర్బల్యములయందు శీఘ్రముగ మరియు శక్తివంతముగా పనిచేయును. మోతాదు : 1,2 మాత్రలు పాలతో.

ప్యాకింగ్ : 25 T, 10 T.

# బైద్యనాథ్
# చూర్ణములు

గుణములు - మూలికలను తాజాగా సేకరించి, ఎండించి చూర్ణముగ తయారు చేయబడును. అసలైన, తాజాయైన మూలికలతో స్వచ్ఛముగా విధననుసరించి తయారు చేయబడిన చూర్ణములు గుణవంతముగా నుండును. పర్వతములనుండి, అడవులనుండి అసలైన, తాజామూలికలను సేకరించు వ్యవస్థ మాకు కలదు. తయారైన చూర్ణములు చక్కటి సీసాలయందు గాలి చొరక సీలు చేయబడుటచే చాలా కాలమువరకు చెడిపోక గుణవంతముగా నుండును.

# అవిపత్తికర చూర్ణము (ఖై.ర.)

అమ్లపిత్తము (Acidity) మరియు దాని ఉపద్రవములయందు సర్వోత్తమ ఔషధము ఉరస్సు, కంఠములందు మంట, నోటిలో పుల్లని ద్రవము స్రేనుపులు ఉరస్సు, కంఠములందు మంట, నోటిలో పుల్లని ద్రవము స్రేనువులు వచ్చుట, మలబద్ధములలో గుణకారి.

మోతాదు : 3 గ్రాములనుండి 6 గ్రాముల వరకు నీరు లేక పాలతో భోజనము చేసిన వెంటనే.

ప్యాకింగ్: 100 గ్రా, 50 గ్రా.

# అశ్వగంధాది చూర్ణము (ఖై.ర.)

వీర్యపుష్టిని కలుగజేయును. బలమును కలిగించును. మానసిక శాంతిని కలిగించును. శరీరమునకు పుష్టి కలిగించును. శుక్రదోషములను పోగొట్టును.

మోతాదు : 3 గ్రా. 6 గ్రా వరకు పాలతో దినమునకు 1,2 సార్లు.

ప్యాకింగ్: 100 గ్రా, 50 గ్రా.

# చోప్‌చీన్యాది చూర్ణము

ఉపదంశవ్యాధి ద్వితీయావస్థయందు రక్తదుష్టి జరిగి చర్మముపై పొడలు వచ్చును. ఈ స్థితిలో ఈ.చూర్ణము రక్తశుద్ధినిచేసి పొడలను మాన్పును.

మోతాదు : 3 గ్రా నుండి 6 గ్రా వరకు నీటితో తీసుకొని తర్వాత సురక్తాటానిక్కు సేవించవలయును.

ప్యాకింగ్: 60 గ్రా.

# తాళసాది చూర్ణము

జీర్ణజ్వరం, కాస, అగ్నిమాంద్యము, అరుచిలయందు సుప్రసిద్ధ ఔషధము.

మోతాదు : 3 నుండి 4 గ్రా. తేనెతో

ప్యాకింగ్ : 60 గ్రా.

## త్రిఫలా చూర్ణము (భావప్రకాశ)

మలబద్ధము, తగ్గించి విరేచనము సరిగా అగునట్లు చేయును. నేత్ర రోగములను, పాండు, కామల రోగములను తగ్గించును, అనుపానముగా వాడవచ్చును. దీనికషాయముతో కేశములు కడుగుటచే వెంట్రుకలు నల్లగా ఒత్తుగా పెరుగును.

మోతాదు : 3 గ్రా వరకు నీటితో.

బాహ్యప్రయోగము నిమిత్తము 20 గ్రా చూర్ణము అరకిలో నీటితో కలిపి 3 గం వరకు ఉంచి ఆ నీటిని వాడువలయును. ధాతుపౌష్టిక చూర్ణమును లోనికి వాడువలయును.

ప్యాకింగ్ : 120 గ్రా. 60 గ్రా.

## పంచాస్కర చూర్ణము (సి. యో. సం.)

ఈ చూర్ణము విరేచనము సరిగా అగునట్లు చేయును. అందువలన అంత్రముల యందు మలసంచయముకాక ఆహార పచనము రస శోషణ సక్రమముగా జరుగును. ఉదర వాయువు (gas) శూల ఉదర కృముల యందు గుణకారి. ఆహార పాచనశక్తిని వృద్ధిచేయును.

మోతాదు : 3 గ్రా నుండి 6 గ్రా వరకు పాలతో రాత్రి నిద్ర పోవుముందు.

ప్యాకింగ్ : 100 గ్రా, 50 గ్రా.

## దాతు పౌష్టిక చూర్ణము (ఆ. ప్ర.)

రసరక్తాది ధాతువులను వృద్ధిచేసి శుక్ర ధాతువులను పెంచును. బలమును కలిగించును.

మోతాదు : 6 గ్రా నుండి 12 గ్రా వరకు పాలతో రాత్రి నిద్రించు సమయమున.

ప్యాకింగ్ : 50 గ్రా.

## పుష్యానుగ చూర్ణము నెం. 2

## (నాగకేసరి యుక్త)

ప్రదరవ్యాధి యందు ఉత్తమఔషధము. స్త్రీల ప్రజననాంగములకు శక్తినిచ్చును.

మోతాదు : 3 గ్రా నుండి 6 గ్రా వరకు దినమునకు 2, 3 సార్లు బియ్యపు కడుగునీటితో

ప్యాకింగ్ : 60 గ్రా.

## మహా సుదర్శన చూర్ణము (సి. యో. సం)

కొయినా మొదలపగు ఔషధములతో అణచబడిన జ్వరమును నిర్మూలించును. ప్లీహవికృతి, త్రిదోషప్రకోపమువలన జనించిన జీర్ణ జ్వరము, విషమజ్వరము, మలబద్ధములను తగ్గించును.

మోతాదు : 3 గ్రా నుండి 8 గ్రా వరకు దినమునకు 3 సార్లు కషాయముగాగాని, ఫాంటముగాని ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 100 గ్రా, 50 గ్రా.

## లవణ భాస్కర చూర్ణము

ఆహారపచనము చేయు చూర్ణములలో రుచికరమైన విశేషగుణకర మైన చూర్ణము. మలబద్ధమును తగ్గించును. నీళ్ళ విరేచనములను తగ్గించును. అగ్నిమాంద్ర్యమునందు గుణకారి. విరేచనములు ఎక్కువగా అయి శరీరము నందలి జలధాతు క్షయము (Dehy Dration) కలిగినప్పుడు లవణముల రూపమున (Electrolites) శరీరమున పనిచేసి ఆంత్రములకు జలమునిచ్చును.

మోతాదు : 2 గ్రా నుండి 4 గ్రా వరకు పెరుగు, పెరుగుమీద తేటతో 3,4 సార్లు ఇవ్వవలయును.

ప్యాకింగ్: 120 గ్రా, 60 గ్రా.

## శతావర్యాది చూర్ణము (యో.ర.)

రస, రక్తాది సప్తధాతువులకు పుష్టి కలిగించును. పిత్తశామకము స్తన్యమును వృద్ధిచేయును.

మోతాదు : 3 గ్రా నుండి 6 గ్రా వరకు పాలతో దినమునకు 2 సార్లు ఇవ్వవలయును.

ప్యాకింగ్: 60 గ్రా.

## సారస్వతాది చూర్ణము

జ్ఞాపకశక్తిని పెంచును.

మోతాదు : 2 గ్రా నుండి 4 గ్రా వరకు బ్రాహ్మీశర్బత్ లేక పాలతో దినమునకు రెండుసార్లు.

ప్యాకింగ్: 50 గ్రా.

## సీతోఫలాది చూర్ణము (భై.ర.)

అన్నికాసలయందు అత్యుత్తమ ఔషధము. దీర్ఘకాలిక జ్వరము, శారీరక దుర్బలత, శ్వాస (Dyspnea) అరుచి, హస్తపాద దాహము లందు అత్యంత గుణకారి. పిత్తనాశకము, కఫనిస్సారకము, క్షయ రోగులు ప్రతినిత్యము సేవించుట మంచిది. టి. బి. యందు అల్లోపతి ఔషధములతో పాటు దీనిని కూడ ఇచ్చుటచే రోగి శీఘ్రముగా ఆరోగ్యవంతుడగును.

మోతాదు : 5 గ్రా నుండి 8 గ్రా వరకు చ్యవన ప్రాశతో రాజయక్ష్మయందు రుదంతీ చూర్ణము మరియు తేనెతో లేక తేనె, నేయి విషయ పరిమాణంలో కలిపి సేవించి పాలను త్రాగవలయును.

# హింగ్వష్టక చూర్ణము

ఉదరవాయువును అనులోమనము చేయును ఆహార వచనము చేసి ఆకలిని పెంచును.

మోతాదు:- 3 గ్రా నుండి 4 గ్రా వరకు నెయ్యి కలిపిన అన్నముతో లేక వేడినీళ్ళతో.

ప్యాకింగ్: 60 గ్రా, 30 గ్రా. 20 గ్రా.

# స్వాదిష్ట విరేచన చూర్ణము.

ఈ స్వాదిష్ట విరేచన చూర్ణము కడుపుబ్బరమును (Constipation) తగ్గించును.

మోతాదు : 1,2 చెంచాలు గోరువెచ్చని నీటితో

ప్యాకింగ్: 100 గ్రా

# బైద్యనాథ్

## అవలేహ-మోదక-పాక

క్వాథములు, స్వరరసములు, ఫాంటములు, శర్కర చేర్చి మరల వండి చిక్కగా తయారు చేసిన దానిని అవలేహ మందురు. మా ఔషధ నిర్మాణశాల యందు అవలేహములు, పాకములు బహు జాగ్రత్తగా తయారు చేయబడును. అందువలన అవలేహములు చెడిపోక, క్రిమి, కీటకాదులు రాక, బూజు పట్టక యుండును.

## ఏరణ్డ్ పాక

## (బృ.ని.ర.)

స్నిగ్ధ విరేచన ఔషధము. వాత వ్యాధులు మరియు సంధి వాతముల (కీళ్ళ నొప్పులు) యందు గుణకారి. ఆమ వాతము, శోధ ఉదర రోగముల యందు పనిచేయును. మలబద్ధము కలిగి మలము అతికష్టముగా ఉండలు ఉండలుగా వచ్చు వారికి బాగా పనిచేయును.

మోతాదు : 10 గ్రా నుండి 15 గ్రా వరకు వేడి నీటితో లేక పాలతో ఇవ్వవలయును.

ప్యాకింగ్ : 100 గ్రా.

## చ్యవన్‌ప్రాశ్ అవలేహ (శా.సం.)

## (అష్ట వర్గ యుక్త)

దీని యందు ప్రధానముగా ఉసిరిక పండ్లు, మరియు అష్టవర్గ ఔషధులు కలవి. ఉసిరిక పండ్ల యందు విటమిన్ ''సి'' సమృద్ధిగ కలదని శాస్త్రవేత్తలచే నిర్ధారించబడినది. బైద్యనాథ్ చ్యవన ప్రాశ్ సేవించుట వలన దీర్ఘకాలిక కాస మరియు శ్వాసలు శమించును. ఊపిరితిత్తులకు బలము కలిగించును. హృదయమునకు శక్తి నిచ్చును. మలబద్ధము తగ్గించి విరేచనము సరిగ చేయును. అమ్లపిత్తము శమించును. బలము, వర్ణము, కాంతి పెంపొందించి రస రక్తాది ధాతువులను వృద్ధి చేసి శరీరమును పుష్టిగ చేయును. స్నాయు మండలమునకు శక్తినిచ్చి సక్రమముగా నియంత్రణ చేయునట్లు చేయును. కాల్షియం, ప్రొటీన్‌లు (మాంస కృత్తులు), పాస్ఫరస్, విటమిన్ 'సి' అధికముగా ఉన్నందున దంతములను గట్టి పరచును. కేశములను వృద్ధి చేసి నల్లగ చేయును. బైద్యనాథ్ చ్యవన ప్రాశ పిల్లలకు పూర్తి పోషణ నిచ్చును.

ఎముకలను దృఢముగా నుంచును. బాలురను ఆరోగ్య వంతులుగ శక్తి వంతులుగ చేయును.

మోతాదు : 12 గ్రా 24 గ్రా వరకు ఉ సా పాలతో.

## చ్యవన్‌ప్రాశ్ అవలేజ

## (స్పెషల్)

పై అష్టవర్గ చ్యవన్ ప్రాశ్ గుణములన్నియు దీనికి కలవు. అమ్ల మధుర, కషాయరసములు, కలిగి యుండును. త్రిదోష శామకము, సంగ్రహణియందు పనిచేయును. మూత్రలము, రక్తశోధకము, రుచ్యము, వయస్థాపకము, బలము, కాంతి బుద్ధి, స్మృతిని పెంపొందించును. ఓజోవర్ధకము, రసాయనము,

సాస్త్రోక్తముగా తయారుచేయబడిన చ్యవన్‌ప్రాశ్‌యందు పై గుణవి కలిగించు జీవన ద్రవ్యములన్నియు వున్ననూ నేటి కాల పరిస్థితిలో గల ౘ సత్యముగల బలహీనులైన వారికి తగినట్లుగా బలము కలిగించుటకై బైద్యనాథ్ చ్యవన్ ప్రాశ్ అవలేహ (స్పెషల్) యందు అత్యంత శక్తికరములైన మకరధ్వజ, అభ్రక భస్మ, శృంగ భస్మ, వెండిరేకులు, కుంకుమపూవు చేర్చి తయారుచేయబడినది. బైద్యనాథ్ అష్టవర్గయుక్త చ్యవన్‌ప్రాశ్ కన్న విశేషగుణవంతమైనది. వృద్ధులుకూడ సేవించతగినది.

మోతాదు : 6 నుండి 12 గా వరకు ఉదయం సాయంత్రం పాలతో.

ప్యాకింగ్ : 1 కేజి. 500గ్రా. 250 గ్రా.

## వాసాన లేహ

ఇందు ''వాస'' తో పాటు ''కంట కారి'' కూడ కలియుట వలన అన్ని కాసల యందు పనిచేయును. విశేషముగా అసాత్మ్యము (Allergy) Bronchites వల్ల వచ్చిన దీర్ఘకాలిక కాస యందు ముఖ్యముగా కఫముతో కూడిన కాసయందు ప్రతిరోజు ఇచ్చుట మంచిది.

మోతాదు : 6గ్రా నుండి 10 గ్రా వరకు పాలతో.

ప్యాకింగ్ : 100 గ్రా.

## బాదామ్ పాక

హృదయమునకు, మస్తిష్కమునకు బలము నిచ్చును. శరీరము బరువు పెంచును. శిరో వ్యాధుల యందు గుణకారి శీతాకాలము నందు సేవించదగిన ఉత్తమ పుష్టికర ఔషధము.

మోతాదు : 6 నుండి 12 గ్రా వరకు ఉదయం, సాంయత్రం పాలతో.

ప్యాకింగ్ : 100 గ్రా.

# సుపారీ పాక

ప్రసవానంతరము సేవించ దగిన ఉత్తమ ఔషధము. గర్భాశయమునకు బలము నిచ్చును. ప్రమేహము, జీర్ణ జ్వరము, అమ్లపిత్తము, రక్తపిత్తము, అగ్ని మాంద్యము, ప్రదరము మొ రోగములను సమూలముగా నిర్మూలించును. అగ్ని వర్ధకము, బల వర్ధకము, వీర్య వర్ధకము, కాంతి వర్ధకము. స్త్రీలలో ఆర్తవ రోగములు తగ్గి సంతాన వంతులగుదురు.

మోతాదు : 10 గ్రా 20 గ్రా వరకు పాలతో

ప్యాకింగ్ : 250 గ్రా. 100 గ్రా.

# సౌభాగ్య శుంఠీపాక (భై.ర.)

సూతికలకు అత్యంత పుష్టికరము. ఆకలి పుట్టించి బలము కలుగజేయును. సూతికా రోగముల నుండి నివారణ కలుగజేయును.

మోతాదు : 6 గ్రా నుండి 15 గ్రా వరకు దినమునకు రెండు సార్లు పాలతో.

ప్యాకింగ్ : 100 గ్రా.

# హరిద్రా ఖండ బృహత్

శీత పిత్తము, దద్దుల యందు గుణకారి. కోష్ఠశుద్ధిని చేయును. అసాత్మ్యము (Allergy) వల్ల వచ్చిన దద్దు యందు, ఇస్నొఫీలియా యందు గుణకారి.

మోతాదు : 6 గ్రా నుండి 10 గ్రా వరకు పాలు లేక నీటితో దినమునకు రెండు సార్లు.

ప్యాకింగ్ : 100 గ్రా.

# దాడిమావలేహ (అనార్ శరబత్)

దాహము, తృష్ణ, రక్త స్రావము, నేత్రరోగములు, పిత్త వికారముల యందు గుణకారి.

ప్యాకింగ్ : 200 Ml, 100 Ml.

# బైద్యనాథ్
# ఔషధ తైలములు

**గుణములు :** ఉత్తమమైన మూలికలతో శాస్త్రోక్తవిధి ననుసరించి తయారుచేయబడిన తైలములు రోగనివారణలో సహాయకములగువనుటలో సందేహము లేదు. శరీరమునకు పుష్టిని కూడ కలిగించును.

**ఉపయోగ విధానము :** తైలము నెమ్మదిగానూ బలమును ఉపయోగించి చర్మములోనికి పోవునట్లుగా మర్దన చేయవలయును. సరిగా మర్దన చేయనియెడల తైలము వల్ల గుణము కనిపించదు.

## ఇరిమేదాది తైలము (శా.సం.)

ముఖ రోగములయందు ఉత్తమ ఔషధము. దంతములు, చిగుళ్ళ యందు వచ్చు వ్యాధులు శమింప చేయును. ప్రతిరోజు ఉదయము సాయంత్రము దంతములకు, చిగుళ్ళపై రాయవలయును.

ప్యాకింగ్ : 50 Ml.

## కాసీసాది తైలము (శా.సం.)

దీనిని ప్రతిదినము 2, 3 సార్లు పైన లేపనము చేయుట వలన అర్శస్సు శమించును. అర్శస్సు వలన వచ్చు కండు దాహము, రక్తస్రావములన అరికట్టును.

ప్యాకింగ్ : 50 Ml.

## చందన బలాలాక్షాది తైలము

దీర్ఘకాలిక జీర్ణజ్వరము, కాస, శ్వాస, దాహము వాత రోగముల యందు గుణకారి బాలురలో వచ్చు రికెట్స్ వ్యాధి యందు అత్యంత గుణకారి. స్త్రీలలో ప్రసవానంతరము దీనితో మర్దన చేయుదురు.

ప్యాకింగ్ : 50 Ml.

## చాల్ మూగరా తైలము

కుష్ఠము, రక్తదోషములు, మరియు చర్మవ్యాధులయందు శ్రేష్ఠమైన ఔషధము. పైకి లేపనముగా మరియు అభ్యంతర ప్రయోగము కూడ చేయవచ్చును.

ప్యాకింగ్ : 50 Ml.

## జత్యాది తైలము (శా.సం.)

వ్రణముల యందు గుణకారి. గాయములు రోషణము (మాన్పుట) చేయును. కాలిన గాయములను కూడా మాన్పును.

ప్యాకింగ్ : 50 Ml.

## నిర్గుండీ తైలము (భైషజ్య రత్నావళి)

వ్రణము అపచి మొదలగు కంఠ వ్యాధులలో మరియు అన్ని రకములైన దుష్ట వ్రణములను మాన్పును.

ప్యాకింగ్ : 50 Ml.

## ప్రసారణీ తైలము

అర్ధితము, గ్రంధివాతము, గృధసీవాతముల యందు గుణకారి వాత వ్యాది కలవారు, నొప్పులు కలవారు నిత్యము మర్దన చేసుకొనుట మంచిది.

ప్యాకింగ్ : 50 Ml.

## పునర్నవాది తైలము (భైషజ్య రత్నావళి)

అన్ని విధములైన శోథలు మరియు పాండు వ్యాధియందు దీని మర్దన గుణకారి.

ప్యాకింగ్ : 50 Ml.

## బిల్వ తైలము (భైషజ్య రత్నావళి)

కర్ణశూల, బాధిర్యము, (వినిపించకపోవుట కర్ణ నాదనము మొ

కర్ణవ్యాధుల యందు గుణకారి ప్రతిరోజు 2,3 చుక్కలు 2,3 సార్లు చెవిలో వేయవలెను.

ప్యాకింగ్ : 25 Ml.

## విష్ణుతైలము బృహత్ (కేసరయుక్త)

అంగశోష (అవయవములు ఎండిపోవుట) సరిగా నడవలేకపోవుట, భ్రమ, శిరశ్శూల, సంధి శూలలయందు ప్రతినిత్యము మర్ధన చేయవలయును.

ప్యాకింగ్ : 25 Ml.

## మహామరిచ్యాది తైలము

కండు, పామ (Scabiea) వ్రణములు, మొదలగు

ప్యాకింగ్ : 100 Ml, 50 Ml.

## మహాచందనాది తైలము (భై.ర.)

బలహీనుడైన రోగికి దీని మర్ధనచే బలము కలుగును.

ప్యాకింగ్ : 50 Ml.

## మహావిషగర్భ తైలము

దీనిని మర్ధన చేయుటవలన వాతమువల్ల జనించిన తీవ్రమైన నొప్పులు తగ్గును. నడవలేక కీళ్ళనొప్పులుకలవారికి అత్యంత గుణకారి. కఠినమైన వాతవ్యాదులు కూడ శమించును.

ప్యాకింగ్ : 100 Ml. 50 Ml..

## మహానారాయణ తైలము (భై.ర.)

## (కేశరయుక్తము)

సంధివాతము, ఆమవాతము, కటీశూల, అంగమర్ధము, పక్షవాతము మొదలగు 8 0 రకముల వాతవ్యాధులు దీని మర్ధనవల్ల శమించును.

ప్యాకింగ్ : 200, 100, 50 Ml.

## మహాభృంగరాజ తైలము (భై. ర.)

మెదడును చల్లబరచును. కేశములను వృద్ధిచేయును. వెంట్రుకలను తెల్లబడనీయదు. ఇంద్రలుప్తము, బట్టతలలయందు పనిచేయును.

ప్యాకింగ్ : 100 Ml, 50 Ml.

## మహామాష తైలము

## (నిరామిష) (భై. ర.)

కృశత్వమును పోగొట్టి అవయవములకు బలమునిచ్చును. వాత వ్యాధులయందు కృశులయందు గుణకారి.

మహాలాక్షాది తైలము

జ్వరము తగ్గిన తర్వాత నుండు దౌర్బల్యము, హస్తపాద దాహము, పార్శ్వశూల, వాతరోగములు కాసలయందు గుణకారి.

ప్యాకింగ్ : 100, 50 Ml.

## శ్రీ గోపాల తైలము

## (కేసరయుక్త) (భాషజ్య రత్నావళి)

ప్రతినిత్యము రాయుటవలన వాత రోగములు శమించును. నరములకు బలమునిచ్చును. అవయవములకు పుష్టినిచ్చును. ప్రత్యేక పరిస్థితులలో అవశ్యకతానుసారము వాడవచ్చును.

ప్యాకింగ్ : - 50 Ml, 25 Ml,

## శంఖపుష్టి తైలము

## (భైషజ్య రత్నావళి)

బాలురకుకలుగు రికెట్సు వ్యాధి యందు కృశత్వమునందు మర్దన చేసిన బాలుడు ఆరోగ్యముగను, పుష్టిగనురోగరహితులుగను అగుదురు.

ప్యాకింగ్ : 50 Ml.

## షడ్‌బిందు తైలము (భైషజ్య రత్నావళి)

శిరశ్శూల, జలుబు, పడిశము, పీనస, నాసర్బుదము (Sinus) వ్యాధులయందు గుణకారి. దీనిని 3 చుక్కల చొ న ముక్కులలో ప్రతిరోజు 2 సార్లు వేసిన సమస్త నాసా రోగములు తగ్గును.

## సైంధవాది తైలము బృహత్ (భై.ర.)

## సోమరాజీ తైలము (భైషజ్య రత్నావళి)

దద్రు, కండూ, పామ, శ్విత్రమూ (Eczmia) మొదలగు చర్మ వ్యాధులయందు గుణకారి.

ప్యాకింగ్ : 50 Ml.

## క్షార తైలము (శా.సం.)

కర్ణశూల, పూతికర్ణము కర్ణస్రావము, కర్ణనాదముల యందు గుణకారి.

ప్యాకింగ్ : 25 Ml, 10 Ml.

## బైద్యనాథ్

## సుగంధిత కేశ తైలములు

బైద్యనాథ్ తైలములు శుద్ధి మైన ఉత్తమైన మూలికతో తయారు చేయబడినవి అగుటచే ఆరోగ్యము కాంక్షించి తైలములు వాడు వారు బైద్యనాథ్ తైలములు వాడుట మంచిది.

## అమ్లా కేశ తైలము

ఈ తైలము ప్రతిదినము వాడుటచే వెంట్రుకలు మెత్తగా, నల్లగా అగును. మంచి సువాసన కలిగి యుండును మెదడుకు చలువ చేయును.

## బ్రాహ్మీ ఆమ్లా కేశ తైలము.

బ్రాహ్మీ (సరస్వతీ ఆకు) ఆమలకీలతో తయారుచేయబడినది. మస్తిష్కమునకు మంచిది. బుద్ధిమాంద్యము పోగొట్టిస్మరణశక్తిని వృద్ధి చేయును.

# మహా భృంగరాజ కేశ తైలము

## (సుగంధ యుక్తము)

చిన్న వయసులో వెంట్రుకలు నెరయుట, ఊడిపోవుటను శమింపచేసి కేశములను నల్లగా ఒత్తుగా చేయుటలో దీనికి సాటియైన తైలములేదు.

# బైద్యనాథ్

## ఘృతములు

గుణధర్మములు రోగానుసారము అనేక మూలికలతో ఆయుర్వేద పద్ధతిలో తయారుచేయబడిన ఘృతములు అత్యంత గుణకరములుగనూ, పుష్టికరములుగనూ వుండును. ఘృతములు అత్యంత స్నిగ్ధగుణము కలిగి మల బద్ధనాశకముగనూ, పిత్తహారముగా, నేత్రములకు హితముగా నుండును. ఉత్తమమైన గోఘృతమే, ఘృతముల తయారీలో ఉపయోగింపబడును.

మోతాదు - అనుపానము :-6 గ్రా. నుండి 12 గ్రా. వరకు గోరు వెచ్చని నీరు, పాలు లేక రోగానుసారుము తగు కషాయముతో సేవించవలయును.

## త్రిఫలఘృత

దీనిని సేవించుటవలన నేత్రదృష్టి పెరుగును. నేత్రవ్యాధులు రక్తదోషములు, రక్తస్రావము పీనస ప్రతిశ్యాయములు శమించును.

ప్యాకింగ్: 100 గ్రా.

## పంచతిక్తఘృత గుగ్గులు

## (భై.ర.)

రక్త దోషములు చర్మవ్యాధుల యందు (ఎగ్జిమా) గుణకారి.

ప్యాకింగ్: 100 గ్రా.

# ఫలకళ్యాణ ఘృత

స్త్రీలకు శ్రేష్ఠమైన ఆరోగ్యకరమైన ఘృతము, వంధ్యాత్వము, గర్భపాతములయందు సేవించదగినది. పురుషులకు గూడ సంతానోత్పాదక శక్తిని వృద్ధి చేయును.

ప్యాకింగ్ : 100 గ్రా.

# బ్రాహ్మీఘృత

దీనిని సేవించుటవలన జ్ఞాపకశక్తి వృద్ధి యగును. స్వరభంగము, ఉన్మాదములయందు కూడ గుణకారి. మోతాదు : 1 గ్రా. 3 గ్రా. తి.

ప్యాకింగ్ : 100 గ్రా.

# బైద్యనాథ్

# ఆసనము– అరిష్టము

ఆయుర్వేద చికిత్సలో క్వాథములు లేక కషాయములు ప్రాముఖ్యతను కలిగి యున్నవి. కాని వీనిని ప్రతిరోజు తాజాగా తయారు చేసుకొనవసి యుండును. ఎప్పటి కప్పుడు శుద్ధ ద్రవ్యములను సమకూర్చుకొనుట కూడా కష్టమే. ఈ ఇబ్బందుల నుండి తప్పించుటకే శాస్త్రము నందు ఆసనములు, అరిష్టములు నిర్మాణము, ఉపయోగము చెప్పబడినది.

# ఆసవ అరిష్టముల శ్రేష్ఠత

ఆసనములు, అరిష్టములు ఎంత పాతవి అయిన అంత మంచి గుణముల నిచ్చును. పాతవి అయిన ఆసనములు అరిష్టములు వ్యాధుల యందు శీఘ్రముగ, నిశ్చయముగా గుణము నిచ్చును. మా 5 ఔషధ నిర్మాణశాలల యందు ఎల్లప్పుడు లక్షణ లీటర్ల ఆసనములు, అరిష్టములు తయారయి యుండును. పాతబడిన తరువాతనే వాటిని విక్రయశాలలకు అమ్మకము నిమిత్తము పంపబడును. ఆసనములు అరిష్టములు 15 మి.లీ. 25 మి.లీ. వరకు సమభాగం నీరు కలిపి రోజుకు రెండు సార్లు భోజనం తరువాత సేవించవలయును.

